ఆంధ్రహైకోర్టుకు
కేంద్రప్రభుత్వ హోంశాఖా
మంత్రిచే ప్రారంభోత్సవం
—3 వ పేజీ

# ఆంధ్రపత్రిక

భారతదేశంలో ఆరవైవేల
మంది కమ్యూనిస్టుపార్టీ
సభ్యులు: మాస్కో ప్రకటన
—6 వ పేజీ

THE ANDHRA PATRIKA - MADRAS. సంపుటం 41. సంచిక 94 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO మంగళవారం 6-7-1954 Reg. No. M. 1118 6 పేజీలు వెల 1 అణా.

# ఉత్సాహ దృశ్యాలమధ్య ఆంధ్ర హైకోర్టు అవతరణ

## గుంటూరులో హోంశాఖమంత్రికట్జూప్రారంభోత్సవం: 50వేలమందిప్రజలహాజరు

## ప్రత్యేక హైకోర్టు అవతరణతో ఆంధ్ర రాష్ట్రానికి సర్వసమగ్ర స్వరూప సంసిద్ధి

### గుంటూరు మహోత్సవంలో మద్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారు ప్రసంగం

గుంటూరు, జులై 5: "హైకోర్టు అవతరణతో నేడు ఆంధ్రరాష్ట్రం సంపూర్ణత్వం పొందింది." అని మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్ గారు ఇవాళ ఆంధ్ర హైకోర్టు ప్రారంభోత్సవ సందర్భంలో ప్రసంగిస్తూ చెప్పారు.

వారింకా యిలా అన్నారు.:

"ఆంధ్ర హైకోర్టును యేర్పాటు చేసే సందర్భంలో యీ ఉదయం యిక్కడ జరుగుతున్న పవిత్ర ఉత్సవాలలో పాల్గొనవలసిందిగా ఆంధ్ర ప్రభుత్వం నన్నాహ్వానించి గౌరవించినందులకు కృతజ్ఞుణ్ణి. ఆంధ్రరాష్ట్రానికిది చరిత్రాత్మకమైనరోజు. ఆంధ్ర రాష్ట్రం '53 అక్టోబరు 1వ తేదీన అవతరించినప్పటికీ, ఇవాళే, ఆంధ్ర రాష్ట్రం సమగ్రరూపం పొందిందని చెప్పాలి. న్యాయ పరిపాలనలో భాషాప్రమేయం లేనిమాట నిజమే. మద్రాసు హైకోర్టు యింతవరకూ ఆంధ్రప్రాంతం విషయంలో కూడా సంతృప్తికరంగా తన విధులను నిర్వర్తిస్తున్నదనుటలో ఎవరికీ సంశయం లేదని నావిశ్వాసం. అయినా, హైకోర్టు లేనిదే యే రాష్ట్రము సమగ్రం కాదు. భారత రాజ్యాంగ చట్టంలో '214 వ నిబంధనలో ప్రతిరాష్ట్రానికి ఒక హైకోర్టుఉండి తీరాలి' అని చెప్పబడింది. కాబట్టి ప్రత్యేక హైకోర్టు త్వరగా యేర్పాటు చేయాలని, ఆంధ్ర ప్రభుత్వం ఆంధ్ర శాసనసభ పట్టుబట్టడం సహజం. ఈ శుభసమయంలో ఆంధ్రరాష్ట్రానికి నా హృదయపూర్వక అభినందనలు తెలుపుకొంటున్నాను. హైకోర్టు ప్రతిష్ఠాపన మహోత్సవం జరుపుటకు ఆచార్యుని వలె, డా॥ కైలాసనాథ కట్జూను రప్పించుకోగలగడం, ఆంధ్రరాష్ట్ర అదృష్టమే!"

"ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులను చూస్తుంటే, ప్రాచీన కాలం నాటి గ్రీకు సంప్రదాయం స్ఫురణకు వస్తున్నది.

ప్రాచీనకాలంనాటి గ్రీసుదేశంలో ఒక

(3 వ పేజీ చూడుడు)

ఆంధ్ర హైకోర్టు అధికార ముద్ర

## గవర్నర్ త్రివేదీ సమక్షంలో ముగ్గురు న్యాయమూర్తుల ప్రమాణ స్వీకారం

### వివిధవర్గాల సహకారానికై ప్రధాన న్యాయమూర్తి విజ్ఞప్తి: ముఖ్యమంత్రి, ఉపముఖ్యమంత్రుల హర్షం

['ఆంధ్రపత్రిక' విలేఖరి]

గుంటూరు, జూలై 5: భారతప్రభుత్వ హోంశాఖామంత్రి డా॥ కైలాసనాథ కట్జూ ఇవాళ ఇక్కడ ఉత్సాహభరిత దృశ్యాలమధ్య ఆంధ్ర హైకోర్టుకు ప్రారంభోత్సవం జరిపారు. భారతప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఈ శుభ సమయంలో తమ హృదయపూర్వక శుభాశీస్సులను తెలియచేశారు. ఈ ప్రారంభోత్సవానికి 50 వేల మంది ప్రజలు సంతోషంతో హాజరయ్యారు. చాలామంది స్త్రీలుగూడావచ్చారు. ఉత్సవం జరుగుచున్నంతసేపు తెగ జల్లు పడుతూనే ఉన్నది. ఎక్కడ చూచినా గొడుగులే ప్రత్యక్షమైనయి. హైకోర్టు ప్రాంగణంలో చక్కని పందిరివేసి తోరణాలతోను, జెండాలతోను మనోజ్ఞంగా అలంకరించారు. పందిరిలో రెండువేలమంది న్యాయవాదులు, మంత్రులు, ప్రభుత్వ కార్యదర్శులు ఉద్యోగులు, పుర ప్రముఖులు పలువురు ఆసీనులయ్యారు.

శ్రీయుతులు నిమ్మగడ్డ సీతారామశాస్త్రి, కప్పగంతుల వెంకటేశ్వర శాస్త్రిగారల వేదపఠనంతో ఆంధ్ర హైకోర్టు స్థాపనోత్సవం ప్రారంభమైంది. శ్రీమతి పి. సుబ్బలక్ష్మిగారు 'వందేమాతరం' గీతాన్ని ఆలాపించారు.

అనంతరం ఆంధ్ర ప్రభుత్వ "లా" శాఖా కార్యదర్శి బి. సి. హెచ్. నారాయణమూర్తిగారు గవర్నరు సి. ఎం. త్రివేదిగారిని, శ్రీమతి కుసుమ త్రివేదీని, హోంశాఖామంత్రి డా॥ కైలాసనాథ కట్జూగారలను పుష్పమాలాలంకృతులను గావించారు.

తర్వాత ఆంధ్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఓబుళంపల్లె పుల్లారెడ్డి గారు ఆంధ్ర హైకోర్టు స్థాపనగూర్చి ప్రధాన న్యాయమూర్తి, న్యాయమూర్తుల నియామకాన్నిగూర్చి చేసిన ప్రకటనను, గుంటూరులో హైకోర్టును స్థాపించడానికి గవర్నరు చేసిన ప్రకటనలను చదివి వినిపించారు.

తర్వాత ఆంధ్రరాష్ట్ర గవర్నరు శ్రీ సి. ఎం. త్రివేదీగారు ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా కోకా సుబ్బారావుగారి చేత, న్యాయమూర్తులుగా శ్రీయుతులు వలగాని చంద్రారెడ్డి, కొండగుంట ఉమామహేశ్వరంగారల చేత హర్షధ్వానాల మధ్య ప్రమాణాలు చేయించారు.

తరువాత గవర్నరు త్రివేదిగారు ఇల్లా అన్నారు: ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం గారిని హోంశాఖా మంత్రి కైలాసనాథ కట్జూ చేత ప్రారంభోత్సవం జరిపించవలసిందిగా కోరవలెనని కోరుతున్నాను."

అనంతరం ముఖ్యమంత్రి ప్రకాశం గారు కొంత సేపు ఇంగ్లీషులోను, కొంతసేపు తెనుగులోను ఉపన్యసిస్తూ మద్రాసు హైకోర్టు పుట్టుపూర్వోత్తరాలను వివరించారు. అప్పుడు ఆరుగురు జడ్జీలతో అది ప్రారంభమైనది. ఇప్పుడు ఇది ముగ్గురు జడ్జీలతో ప్రా

(2 వ పేజీ చూడుడు)

## న్యాయ పరిపాలనకు ఆంధ్ర హైకోర్టు ఉపక్రమణ

### తూర్పు గోదావరిజిల్లాకు చెందిన భాగ స్వామ్యం తగాదా అప్పీలు విచారణ

గుంటూరు, జూలై 5: ఆంధ్ర హైకోర్టు యివాళ పని ప్రారంభించింది. ప్రధాన న్యాయమూర్తి శ్రీ సుబ్బారావుగారు న్యాయమూర్తి శ్రీ ఉమామహేశ్వరంగారలు మొట్టమొదటగా తూర్పుగోదావరి జిల్లాకు సంబంధించిన ఒక భాగస్వామ్యం తగాయిదా అప్పీలు ఇచ్చారు. వాది చిట్టూరి సరయ్య ప్రతివాది చిట్టూరి నారయ్య. వాది తరఫున నరసరాజు వాదన ప్రారంభించి, నామమాత్రంగా వాదన చేశారు. అనంతరం కోర్టు వాయిదా వేశారు.

న్యా. చంద్రా రెడ్డిగారు అడ్మిషన్లు దాఖలు చేసుకొన్నారు.

## ఆసియాదేశాలవ్యాపారసంబంధసమావేశం

బొంబయి, జూలై 4: దక్షిణ, ఆగ్నేయ ఆసియా ప్రాంతాల ఆర్థికాభివృద్ధి, ఆసియా దేశాల మధ్య వ్యాపారాదికాలు పరస్పర సమన్వయంతో జరిగే వీలు కలిగించేనిమిత్తం అఖిల భారత ఉత్పత్తిదారుల వ్యవస్థవారు ఈ యేడాది నవంబరు నెలలో ఈ దేశాల సమావేశం ఒకటి ఏర్పరుస్తారని ఈ వ్యవస్థ అధ్యక్షుడు మొరార్జీ వైద్య అన్నారు. ఈ సమన్వయ కృషిలో ఇండియా, జపాన్, బర్మా, ఇండోనీషియా, పాకిస్తాన్, సిలోన్లతో పాటు ఇక వచ్చినాకూడా పాల్గొనవచ్చునని అనుకోవచ్చుననీ, థాయిలాండ్, ఫిలిప్పీన్స్‌కూడా సమావేశానికి రాగలవనీ ఆయనన్నారు.

## ఉన్నత సంప్రదాయాలనెలకొల్పడంలో న్యాయవాదుల సంపూర్ణ సహకారం

### ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి అభ్యర్థన

### అడ్వొకేట్‌జనరల్‌స్వాగతానికిశ్రీకోకాసుబ్బారావుగారిసమాధానం

గుంటూరు, జులై 5: "ఏ కోర్టులోనైనా యీనాడు జడ్జీలను ఎదుర్కొంటున్న సమస్య, పేరుకపోయిన పాత దావాలను పరిష్కరించడం. దీనికి గాను అన్ని విధాలా వున్న మార్గాలు ఆలోచించినా ఆచరణలో మాత్రం ఫలితం కన్పించడంలేదు. మార్గమల్లా ఒక్కటే. అది న్యాయవాదుల, న్యాయమూర్తుల సంపూర్ణసహకారం. వాదనలను క్లుప్తంగాను సమగ్రంగాను చేసి అనవసరమైన వాయిదాలను కోరకుండాను, దుశ్చింతనతో కూడిన వ్యాజ్యాలు లేకుండా ప్రయత్నం చేయాలి" అని యీ ఉదయం ఆంధ్ర హైకోర్టు ప్రారంభం చేయబడిన తరువాత కోర్టు హాలులో అడ్వొకేట్ జనరల్ దువ్వూరి నరసరాజు గారు, న్యాయమూర్తులకిచ్చిన స్వాగతానికి సమాధానంగా ప్రధాన న్యాయమూర్తి సుబ్బారావుగారు చెప్పారు.

ప్రధాన న్యాయమూర్తికోర్టులో ఆంధ్రన్యాయవాదులతరఫునదువ్వూరినరసరాజుగారు స్వాగతం చెబుతు యిలా అన్నారు.

ఇలాంటిచరిత్రాత్మకమైన సమయం యేశాఖ చరిత్రలోనైనా, ఏ వ్యక్తి జీవితంలోనైనా ఒక్కసారే వస్తుంది. ప్రప్రథమంగా అడ్వొకేట్ జనరల్ గా ఉండి ఆంధ్ర హైకోర్టు ప్రారంభమయిన యీ రోజున న్యాయమూర్తులకు స్వాగతం యివ్వ చాలా అవకాశం కల్గించినందుకు భగవంతునికి కృతజ్ఞుణ్ణి. ఆంధ్ర దేశంలోని న్యాయవాదుల తరఫున మీకు హృదయపూర్వక అభినందనలు. రాష్ట్ర గౌరవము, ఉన్నత న్యాయస్థాన గౌరవము కాపాడుటకు జరిగే ప్రయత్నాలలో న్యాయవాదులు హృదయపూర్వకంగ సహకారం చేయగలరని హామీ యిస్తున్నాను. యింతవరకు ప్రపంచంలో ఒక ఉన్నత స్థానం సంపాదించిన, మద్రాసు హైకోర్టులో భాగంగా ఉన్నాము. ఆ హైకోర్టులో సంపాదించిన అనుభవాలతో ఆ హైకోర్టు ఏర్పరచిన ఉన్నత సంప్రదాయాలను, అనుసరించడానికి, అంతకు మించిన ఉన్నత సంప్రదాయాలను ఏర్పర్చడానికి మనం ఐక్యంగా కృషిచేయాలి. న్యాయం చేయడంలో న్యాయవాదుల పాత్ర చాలా ప్రాముఖ్యత కలది. ఆంధ్ర హైకోర్టు న్యాయవాదులు హైకోర్టు గౌరవానికి భంగం కలిగే విధంగా ఎవరూ ప్రవర్తించరని హామీ యిస్తున్నాను.

తరువాత ప్రధాన న్యాయమూర్తి సుబ్బారావుగారు స్వాగతానికి సమాధానం చెబుతూ ప్రథమంగా, ప్రధాన న్యాయమూర్తి అయినందుకు చాలా సంతోషిస్తున్నాననిఅన్నారు. న్యాయమూర్తుల ప్రతిభ న్యాయవాదులపైగూడా ఆధారపడిఉంటుంది. ఉన్నత సంప్రదాయాలను నెలకొల్పిన మద్రాసు హైకోర్టునుంచివచ్చిన న్యాయవాదులు, గుంటూరు న్యాయవాదులుకలసి ఆంధ్ర హైకోర్టులో ఉన్నత సంప్ర

(2 వ పేజీ చూడుడు)

## సోషలిస్టు నాయకుడు లోహియా అరెస్టు

### నీటితీరువ హెచ్చింపు చెల్లించకూడదని ప్రచారం చేసిన ఫలితం

ఫతేపూర్, జూలై 5: ప్రజా సోషలిస్టుపార్టీ నాయకుడు డా॥ రామమనోహరలోహియాను ఇచ్చటకు 30 మైళ్ల దూరంలోవున్న ఫర్రూకాబాద్‌లో 1932 ప్రత్యేక అధికారాల చట్టాన్ని అనుసరించి అరెస్టుచేసి, జైలుకు పంపించారు.

డా॥ లోహియా లక్నో నుంచి నిన్న యిచ్చటికి వచ్చారు. ఫరూకాబాద్ లలో నీటితీరువ హెచ్చింపును గురించి ఆక్షేపిస్తూ, బహిరంగసభలలో ఉపన్యసించారు. ఈ హెచ్చు నీటితీరువను కట్టవద్దని, పోలీసు అత్యాచారాలు ఎక్కువ అవుతున్నాయని గూడా ఆయన యీ ఉపన్యాసాలలో పేర్కొన్నారు.

డా॥ లోహియాను యు. పి. ప్రభుత్వం నేటి మధ్యాహ్నం 10½ గంటలకు అరెస్టుచేసింది. కాంగ్రెస్ వాది అయిన ఒక స్నేహితుని ఇంటికి అతిథిగా భోజనానికిపోగా అక్కడఅరెస్టు చేసింది.

యు. పి. లో యీ నీటితీరువ హెచ్చింపును గురించి ఇతఃపూర్వం నుంచి ఆందోళన జరుగుతున్నది. ఈ ఆందోళనలో పాల్గొన్న అనేకమందిని ప్రభుత్వం అరెస్టు చేయించింది.

### శ్రీ ఉమ్మెత్తల కేశవరావు పూనా ప్రయాణం

హైదరాబాదు, జూలై 3: భూదాన సమితి వ్యవహారాలను గురించి సంప్రతింపులు జరపటానికి పూనాలో తమని కలుసుకోమని జయప్రకాశ్ నారాయణ్, శ్రీ ఉమ్మెత్తల కేశవరావు గారికి టెలిగ్రాం పంపారు. శ్రీ కేశవరావు గారు రెండురోజులలో పూనాకు వెడతారు. (స్వ. వి.)

# "న్యాయనిర్వహణలో విశేషవ్యయప్రయాసలు ఉండకూడదు"

## గుంటూరులో ఆంధ్రహైకోర్టుఅవతరణ: కేంద్రహోంశాఖమంత్రికట్జూ ఉద్బోధ

### ఉన్నత న్యాయస్థాన ఉత్తమ సంప్రదాయాలను ఆంధ్రదేశం పోషించి, పెంపొందజేయాలనిహితవు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

గుంటూరు, జులై 5: "ఆంధ్రుల చిరకాల గాఢవాంఛాఫలసిద్ధే ప్రత్యేక హైకోర్టు అవతరణ. ఈ ఉన్నత న్యాయస్థాన స్థాపన ఫలితంగా న్యాయనిర్వహణ వివిధకక్షిదారులకూ అతి సమీపంలో జరుగుతుంది కాబట్టి, ప్రజానీకం తప్పక ఈ యేర్పాటుకు హర్షిస్తుందనే భావిస్తున్నాను. న్యాయశాస్త్ర పారంగతులైన ఆంధ్ర న్యాయమూర్తులు న్యాయస్థానాలలో వ్యయప్రయాసలను ఏవిధంగానైనా సాధ్యమైనంత తగ్గించడమనే విషయాన్ని శ్రద్ధగా పరిశీలిస్తారని ఆశిస్తున్నాను," అని భారతప్రభుత్వ హోంశాఖ మంత్రి డా॥ కైలాసనాథ్ కట్జూ ఇక్కడ నేటి ఉదయం ఆంధ్ర హైకోర్టుకు ప్రారంభోత్సవం జరుపుతూ ఉద్బోధించారు.

"సకాలంలో లభించని న్యాయం మాదిరిగా అపరిమిత ధనవ్యయంతో చేకూరే న్యాయంలోకూడా. "వాస్తవమైన న్యాయం" శూన్యమవుతుందనే చెప్పవలసివుంటుంది. న్యాయప్రాప్తికి అమితధనం ఖర్చు పెట్టాలనడం తప్పకుండా విమర్శించదగినదే." అని కూడా డాక్టర్ కట్జూ విమర్శించారు.

#### కట్జూ ప్రసంగ పాఠం

"ఈ ఉదయం ఇక్కడ జరుగుతున్న ఈ ఉత్సవంలో పాల్గొనవలసిందిగా నన్ను ఆహ్వానించి మర్యాద చేశారు. నేను న్యాయశాస్త్రంలో పెరిగాను. నన్ను అట్లా పెంచారు. నా జీవితంలో 38 ఏండ్లు న్యాయస్థానాల్లో ప్రాక్టీసు చేయడంలో గడిపాను. అందువల్ల నాకు హైకోర్టులంటే ఏమిటో, దాని క్రింద పనిచేసే న్యాయస్థానాలంటే ఏమిటో బాగా తెలుసును. ప్రజా జీవితంలో ఇవి ఎట్టి పాత్రను నిర్వహించేది తెలుసును. దేశాన్నంతా చీకట్లు ఆక్రమించుకొని వున్నప్పుడు, జనం విదేశీ పరిపాలనలో క్రుంగుతున్నప్పుడు ఈ దేశంలో ఆవిధమైన పాలన చేసి ఈ న్యాయస్థానాలను స్థాపించి, వారి దేశంలో న్యాయ,ధర్మాలయొక్క ప్రధానలక్ష్యాలనే వీటిల్లోగూడా విధ్యుత పరిచి, నిరంకుశత్వాన్ని, న్యాయధర్మ విరుద్ధ కార్యకలాపాలను ఎదుర్కొనడానికి తగిన అస్త్రాన్ని కల్పించినందుకు, వారిని ఈ సందర్భంలో మెచ్చుకోవలసే వుంది. అట్లా ఈ న్యాయస్థానాలను నెలకొల్పిన గౌరవాన్ని వారికే ఇద్దాం. ఇంగ్లీషువాలు వారి దేశంలో న్యాయ ధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని, అదే విధంగా ఈ దేశంలో గూడా దేశం అంతటికీ వర్తించే స్మృతులను, శాసనాలను సృష్టించగా న్యాయస్థానాల్లోని న్యాయమూర్తులు అధర్మం అ... నిష్పక్షికంగానూ, న్యా...తంగానూ, సమబుద్ధితోను అమలుజరిగేటట్లు చూచారు. హైకోర్టులు ప్రజల స్వాతంత్ర్యాన్ని రక్షించేందుకు యేర్పడ్డ ధర్మాయతనాలని మనం అంటూవున్న సందర్భంలో, ఆదిలో యీ న్యాయస్థానాలలో న్యాయమూర్తులు గా యింగ్లీషువాళ్లే వుండేవాళ్లని, వాళ్లు గూడా న్యాయధర్మానుసారంగా వ్యవహరించేవాళ్లని తాము ఇచ్చట న్యాయమూర్తులు మాత్రమేనని గుర్తువుంచుకొని, తటస్థమైన భావాన్ని దెన్నదరి చేరనీయక నిజాయితీని ప్రదర్శిస్తూ నిష్పక్షపాతాన్ని వ్యక్తపరుస్తూ, తమ స్వతంత్రతను చాటుతూ వుండేవారని గుర్తుతెచ్చుకోవడం గూడా అవసరం.

మనం జాతీయ స్వాతంత్ర్య సమరాన్ని సాగిస్తున్న రోజుల్లో ఇండియా ప్రజలను నిరంకుశులయిన బ్రిటిష్ అధికారులు అనేకవిధాలుగా బాధిస్తున్న రోజుల్లో, బ్రిటిష్ఇండియా అనబడే ప్రాంతం అంతా ఈ న్యాయస్థానాలను నిరంకుశత్వంనుంచి తన్ను రక్షించే భద్రతా కేంద్రాలుగాను, తన కష్టాలను విచారించి, వాటిని నివారించే ధర్మాయతనాలుగాను భావిస్తూ వుండేది. ఈ మహా ముఖ్యవిషయాన్ని మనం ఎప్పుడూ మరిచిపోయేందుకు వీలులేదు. మనదేశంలో, గతించిన దినాల్లో, కుటుంబ వ్యవహారాలను, గ్రామ వ్యవహారాలను గూర్చి వచ్చిన చిక్కులను విడదీసుకోవలసి వచ్చినప్పుడు తాము ఏర్పాటుచేసుకున్న పంచాయతీలద్వారా, తమ మనస్సుకు తోచినవిధంగా, తమకు నచ్చిన పద్ధతులద్వారా న్యాయాన్ని పాలించుకోవడం అన్న అవకాశం వున్న రోజుల్లోగూడా, రాజును సర్వ ధర్మాధిపతిగా గుర్తించడం అంటూ వుంది. రాజ్యంలో దండనీతి తోపాటు, రాజనీతిగూడా రాజునందే నిబిడమై వుండేది. అట్లా ఆ రాజు రాజ్యాన్ని పరిపాలించనూ పరిపాలించేవాడు, ధర్మాన్ని ప్రపంచించను ప్రపంచించేవాడు. రాజులు చాలా మంచి సమబుద్ధితోను, ధర్మదక్షతంగానూ, దయా దాక్షిణ్యాలతోను వ్యవహరించివున్నా, రాజు తనలోనే పాలకున్నీ, న్యాయమూర్తినీ నిలిపి చేసుకున్నట్లు స్పష్టమవుతూనే వుంది. ఇప్పుడు ఈ ప్రజాస్వామ్య యుగంలో గూడా కొన్నికొన్ని దేశాలలో అమలు జరుగుతూవుండటగా మనం చూస్తూనే వున్నాం. ఒక్క ఇంగ్లండుమాత్రం ఈ న్యాయనిర్వహణకు కొత్తపద్ధతిని ఒకదాన్ని కనిపెట్టింది. అందుకునిజంగా ఆదేశం ఎంతైనా గర్వాన్ని వహించవచ్చు. రాజు పేర ధర్మాధీశుడు న్యాయాన్ని పాలిస్తూవున్నా, ఆ పరిపాలనలో మాత్రం అతనే రాజు. అసలు రాజుకు అందులో ప్రమేయం పెట్టుకోడు. సాంప్రదాయకంగా వస్తున్న ఈ తమ ధర్మమర్యాదనే బ్రిటిష్ రాజులు ఇండియాలోగూడా ప్రవేశపెట్టారు. ఇండియన్ హైకోర్టు జరిగిన వందఏండ్లలోను న్యాయాన్ని నిష్పక్షపాతంతో పాలించి, భారతప్రజల ఆదరాభిమానాలను చూరగొని, తమకు చిరంతనమైన స్థానాన్ని వారి హృదయాల స్థాపించుకోగల్గాయి.

#### పంచాయితీ కోర్టులు

న్యాయనిర్వహణకు సంబంధించిన తొలి అవస్థలలో గూడా ట్రిబ్యునల్ కోర్టులకు కేసులుపంపి, న్యాయసంబంధమైన పరిపాలన కేంద్రీకృతం అయ్యేట్లు చేయడంవల్ల దేశానికి నష్టం వాటిల్లేమాట నిజమే. ఇట్టి సందర్భాల్లో భారతీయమైన పంచాయతీ పద్ధతిని అనుసరించడం అన్నివిధాలా యోగ్యంగా కనబడుతుంది. ఈపంచాయతీలనుపురాతన భారతదేశంలో స్థానికులే ఎన్నుకునేవాళ్లు; లేదా సాంప్రదాయకంగా నియమించుకునే వాళ్లు. చిన్నచిన్న తగాదాలన్నీ - అవి శిష్టాచారవ్యవహారాలకు సంబంధించినవి కానీ, లేక అభియుక్త అభియోగాలకు సంబంధించినవి కానీ ఈపంచాయతీలలో తేల్చబడుతూ వుండేవి. ఇట్లు చేయడంలో అనేక లాభాలు వున్నాయి. ఇందులో ఖర్చులు అట్టే వుండవు. న్యాయం త్వరితగతిని పాలించబడుతుంది. దీనితతో నిష్పక్షపాతంతో వ్యవహరించవచ్చు. ఇక ఇందులో మోసానికి తావు వుండదు. అంతా బాహాటంగా, బహిరంగంగా జరిగిపోతుంది. ఇట్టి న్యాయస్థానాలే నిజమైన జన న్యాయస్థానాలు. ఈ పంచాయతీలు న్యాయాన్ని గ్రామం అంతముందు తీర్చిదిద్దుతాయి. దొంగసాక్ష్యాలు చెప్పే పాపకోశం వుండదు. పాపకోశం వుండటం కాదు; అట్లా ఇద్దామని వచ్చినవాళ్లు గూడా గ్రామాన్ని అంతా చూచి, మనస్సును సంస్కరించుకుంటారు. ప్రపంచంలో అన్ని రాజ్యాలలోను సత్యాన్ని గురించి ప్రశస్తంగా వక్కాణిస్తూవుంటారు; కానిఇండియాలో సత్యమే దైవమనేటంతవరకు మనం వచ్చాం. మహాత్మాగాంధీ "సత్యమే దైవం; దైవమే సత్యం" అంటూవుండేవారు. ఈ మహాసత్యం పురా భారత దైనందిన ప్రజాజీవితంలో పారంపర్యంగా వ్యక్తమౌతూ వచ్చింది. ఈ దేశాన్ని చూద్దామనివచ్చి ప్రతి విదేశీయాత్రికుడు, ఇచ్చట ప్రజలోని వ్యక్తిలోని ఈ మహాసత్య ధార్మిక గుణాలనుచూచి, ముగ్ధులైపోయినట్లు, ప్రతి అట్టి ఒక్కని వ్రాతలలోను కన్పిస్తున్నది. ఈ మహాగుణాన్ని పంచాయితీలు, పంచాయతీలద్వారా న్యాయాన్ని పాలించడం. ఇవి న్యాయాన్ని పోషించాయని వేరేచెప్పనవసరంలేదు. బ్రిటిష్వాళ్లు వచ్చి ఆ మహా కార్మిక వ్యవస్థనంతా నాశనం చేశారు, న్యాయనిర్వహణను వాళ్లు కేంద్రీకృతం చేశారు. తమ తగాదాలను తీర్చుకోవాలంటే, జనం, అల్పమైన తగాదాల కోసం గూడా దూర ప్రాంతాలకు ప్రయాణం చెయ్యవలసిన స్థితి అందువల్ల ఏర్పడింది. ఆప్రజలు తమకు అపరిచితమైన పట్టణాలకు పోవాలి. అపరిచితమైన పరిసరాల్లో మెలగాలి. తమవెంట సాక్షులను గూడా తీసుకుపోవాలి. ఈ సాక్షులు అన్యాయ స్థానాల్లో తమ్ము నియమించి, హృదయాల్లో వుంచే గ్రామజనంకొక పాపమెందవలసినంతటి కూట సాక్ష్యానికి దిగుతుంచే అటువంటి కూట సాక్ష్యానికి దిగజారిపోయి. సాక్ష్యం నేరుగా కట్టుకథలు అల్లినవాళ్లు, యీ విధంగా న్యాయస్థానాలలో న్యాయం కూటబుద్ధులలో కలుషితం అయిపోయింది. ఈ ఇన్ని అబద్ధాలలో సత్యం ఎక్కడ దాగుకొనివుందో తెలిసి, పట్టుకోగల్గడం న్యాయమూర్తులకు కష్టమైపోయింది. ఎప్పిలేటుకోర్టుల్లో వ్రాతరికార్డులనుచూచి, తీర్పు ఇవ్వవలసివుంటుంది గనుక, అట్టిసందర్భాలలో న్యాయమూర్తులు ప్రజ్ఞను ప్రదర్శించి సత్యాన్ని గ్రహించడంవుంది. ఇందులో భారతీయ న్యాయమూర్తులు సిద్ధహస్తులన్న సంగతి ప్రపంచంఅంతా గుర్తించింది. వారి ఇంగితం, విచక్షణ, న్యాయనిర్వహణయందు తాత్పర్యం ఇవిఅన్నీ వారికి ప్రపంచంలో ప్రఖ్యాతిని సాధించిపెట్టాయి. నిర్భీకంగా, నిష్పక్షపాతంగా, సమర్థంగా, అనిందితంగా, వారు తమ ధర్మాన్ని నిర్వహించారు.

#### మద్రాసు హైకోర్టు సత్సంప్రదాయాలు

దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు, ఆవెనకటిరంనుంచి, ప్రజలమన్ననలకుపాత్రమై, వారి విశ్వాసాన్ని చూరగొని, వారి నమ్మకానికి గురియైన ఈ హైకోర్టులకు మనం వారసులం కావడం నిజంగా అదృష్టమనే చెప్పాలి. ఆ పాత వ్యవస్థల్లో ఈ ఒక్క కోర్టుల్లోనే ప్రజలు విశ్వాసం నిల్పివుండటం గమనార్హం. ఇట్టి హైకోర్టుల్లో మద్రాసు హైకోర్టు మరీ ప్రసిద్ధమైంది. నేను ఎప్పుడూ ఈకోర్టులో హాజరై వాదించలేదుగాని, దేశంలో అందరు లాయర్లకు వలెనే, నేనుగూడా ఈ హైకోర్టు ఇచ్చిన తీర్పులను మహామన్ననతో చదివేవాణ్ణి. భారతీయ న్యాయమూర్తుల్లో మహాప్రసిద్ధులయిన వాళ్లు, పండితులయినవాళ్లు, మద్రాసులో ధర్మాసనం అలంకరించారు. న్యాయశాస్త్ర ప్రపంచంలో వారి నామాలు పూజనీయములయినాయి. మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులే గాక, అచ్చటి లాయర్లుగూడాచాలాప్రసిద్ధులు, పండితులు, విచక్షణులు, వాఙ్మయులు, ఇంగితజ్ఞులు, శక్తిమంతులు అయి ఆ కోర్టులో ఉద్భవిల్లారు. న్యాయంలో అంశాలను పరిశీలించి, విడదీసి, పరిష్కారాలను దిద్దడంలో మద్రాసు ధర్మాసనం ఏమి, న్యాయవాదివర్గం ఏమి, అఖిల భారతంలోను విశిష్టతను గడించాయి. ఇప్పుడు మదరాసురాష్ట్రము విభజింపబడినా, యీ వంద సంవత్సరాలుగా మద్రాసు న్యాయస్థానం నిర్మించుకుంటూవచ్చిన మహాసంప్రదాయాలు ఆంధ్రదేశంలోగూడా పోషింపబడతాయని నేను విశ్వసిస్తున్నాను.

#### అనాసక్తభావం

మతంయొక్క ప్రకృష్టతవల్ల భారతీయమైన మనస్సు సహజంగా అనాసక్త భావలక్షణ లక్షితమైవుంది. మరి యీ అనాసక్త భావం అన్నది న్యాయమూర్తులు పెంపొందించుకోవలసిన ప్రధాన లక్షణం. ఇట్టి అనాసక్త భావం మనరక్తంలో ఇమిడివుండటమే యింతవుంది సర్వ జగత్ప్రసిద్ధులయిన న్యాయమూర్తులు సృష్టిలడానికి కారణం అయిందేమోనని నాకు అన్పిస్తూవుంటుంది. ధార్మిక పక్షేంగితము, ధార్మిక సమబుద్ధి, ధార్మిక స్వాతంత్ర్యము భారతీయ న్యాయమూర్తికి పుట్టుకతోవచ్చిన భూషణాల్లాగా వుంటాయి. వారిలో ఇమిడివున్న అనాసక్త భావమే వారికి సమదృష్టిని, ప్రసాదించి, న్యాయవిచారణలో పౌరుడికీ పౌరుడికీ మధ్య, పౌరుడికీ ప్రభుత్వానికి మధ్య తారతమ్యాన్ని ఎంచకుండా వ్యవహరించేందుకు వారికి తోడ్పడుతోంది. అందువల్లనే వారు కులమత, వర్గభేదాలకు అతీతులై, ఎవరి కోర్కెలకు అనుయుక్తమయిన తీర్పును వారికి చెప్పగల్గుతున్నారు. అనాసక్తభావనే ప్రతిభారతీయ న్యాయమూర్తికి ధ్రువనక్షత్రంలాగా మార్గదర్శకం కాగలదని నేను ఆశిస్తున్నాను.

భగవత్కృపవల్ల, రాజకీయదాస్యం తొలగింది. సుదీర్ఘ నిశ నిర్గమించింది. స్వాతంత్ర్య భానూదయమైంది. తిరిగి భారతావనిపైన స్వేచ్ఛ వల్లి విరిసింది. వయోజన ఓటింగువల్ల ప్రజానీకం రాజకీయంగా తనకు గల శక్తిని గ్రహించింది.

తామే తమ భవితవ్య నిర్ణేతలనీ, ప్రభువులనీ ప్రజలు అవగాహన చేసుకున్నారు.

నేటి న్యాయశాఖ వ్యవహరణ విధానాలను ప్రజలు రానురాను సునిశితంగా విమర్శిస్తున్నారు. నిజమే. సకాలంలో జరుగని న్యాయం అసలు న్యాయమే కాకుండా చేయడం వంటిదన్న సూక్తి పరమసత్యం. ఇంతేకాదు నేటి న్యాయశాఖలో విమర్శనీయమైన అంశం మరొకటి గూడా గోచరిస్తున్నది.

సకాలంలోలభించని న్యాయంలాగే, అమిత ధనవ్యయంకోరే న్యాయం కూడా, న్యాయం నాస్తిఅనడంవంటిదే. న్యాయం చెప్పడానికి అమితధనం ఖర్చు పెట్టాలనడం తప్పకుండా విమర్శించతగినదే.

నిజానికి ఏ ప్రభుత్వానికైనా ధనవ్యయంలేకుండా ప్రజలకు న్యాయం లభింపచేయడం ప్రాథమిక కర్మలలో ఒకటి. ఉచితంగా న్యాయనిర్వహణ సాధ్యం కాని పక్షంలో చెప్పతోతగినంత తక్కువ ఖర్చులో న్యాయం లభింపచేయాలి.

సర్వత్రా ఒక అభిప్రాయం ఏర్పడి ఉంది. ఇద్దరు తగాదాపడినపుడు, అందులో ఒకడు ధనవంతుడూ, రెండవవాడు కొంచెం బీదా అయితే బీదవాడికి న్యాయం లభించదని ఏదో వంక చూపి కోర్టుల వెంట తిప్పుతారు. తిరగ్గా తిరగ్గా కొన్నాళ్లకి తగాదా పరిష్కారమవుతుంది. ఆ నాటికే ఇతడి ఆస్తి సర్వనాశనమైపోతుంది. బికారి అవుతాడు. అప్పుడు అతడు ఆ తగాదాలో గెలిచినా అది పసలేని గెలుపుగా నిస్సారమైన విజయంగా భావిస్తాడు.

ఏభై సంవత్సరాల క్రితం కోర్టులకి వెళ్లి కేసులు జరపడం ధనవంతులకి విలాసంగా భావించబడేది.

వాది ప్రతివాదు లిద్దరికి విపరీతంగా డబ్బు ఖర్చు అవడానికి ఉండే అన్ని పద్ధతులనీ న్యాయస్థానాలు అనుమతించాయి.

హైకోర్టులు అనుమతించిన విధానాలు చెప్పనక్కర లేదు.

అప్పీలు చెయ్యడానికి, మళ్ళీదాన్ని తిరగతోడడానికి, దానికి, దీనికి సవాలక్ష మార్గాలలో విపరీతంగా డబ్బు ఖర్చు అయ్యేది.

ఒక విషయం ఎవరూ కాదనలేరు. కింది కోర్టులో నిజంగా తనకి అన్యాయం జరిగిందనుకునే వాదికి గాని ప్రతివాదికి గాని పై కోర్టుకు వెళ్లడానికి పూర్తి హక్కు ఉంది. ఈ అమూల్యమైన హక్కుని ఎవరూ కాదనలేరు.

అయితే, ఈ పద్ధతిలో, తనకి అన్యాయం జరిగిందని పై కోర్టులో అప్పీలు చేస్తానని వచ్చే చాలామంది చెప్పే వాదాలు ఊహించినవనీ, కేవలం ఎదటి పార్టీని ఇరుకున పెట్టడానికి వీళ్లు వేసే ఎత్తులనీ, న్యాయవాదు లందరికీ తెలుసు.

ఈ ధోరణి ఇలా సాగడం భారత ప్రజలు ఇటుపై సహించరనే భావిస్తున్నాను.

తగాదాకు ఎక్కడో అక్కడ తుదినిర్ణయం జరిగిపోవాలి. ఊరికే పట్టుదలలు పెంచుకుని అప్పీళ్లమీద అప్పీళ్లు వేయడంవల్ల తలోచోటా తలోరకమైన తీర్పు వస్తోంది. ఈ పరస్పర వైరుధ్యంవల్ల నిజమైన నిజం ఏదో, ఎవ్వరికీ తెలియకుండా పోతుంది. ఇటువంటి అర్థరహితమైన అన్వేషణ వాంఛనీయంకాదు. ప్రజాశ్రేయస్సు దృష్ట్యా, తగాదాలు త్వరత్వరగా పరిష్కారమైపోవాలి. ఒక్క అప్పీలులోనే ఎంత పెద్ద వ్యవహారమైనా సరిసమాప్తి కావాలి.

#### సాంకేతిక కారణాలు

కొన్ని సందర్భాలలో చెప్పబడే తీర్పులపట్ల న్యాయవాదుల అభిప్రాయాలకీ, ప్రజానీకపు భావాలకీ ఎంతో విభిన్నత కనబడుతుంది.

వైద్యుడికి ఒకొక్క వ్యాధి సంక్లిష్ట లక్షణాలు ఉత్సాహ శ్రద్ధలు ప్రేరేపించినట్లే, న్యాయవాదులకు కూడా న్యాయశాస్త్రంలోని కొన్ని క్లిష్టఅంశాలు ఎంతో ఉత్సాహాన్ని కలిగించి ఆకర్షిస్తాయి.

న్యాయవాదులు తా సంక్లిష్ట న్యాయాంశాలను గురించి చర్చించడానికి ఎంతో ఉవ్విళ్లూరుతారు.

న్యాయస్థానంలో ఈ మేధస్సంపన్నులందరూ క్లిష్టతమ విషయాలపై హోరాహోరీని వాదప్రతివాదాలు చేస్తూఉంటే, వీటికి మూలాధారులైన వాదిగాని ప్రతివాదిగాని డబ్బు మూసుకుంటారు. ఈ పద్ధతిలో కేసు పూర్తి అయ్యేసరికి తనకు ఎంత డబ్బు వదులుతుందో ఆలోచించుకుని, ఇందులోకి ఎందుకు దిగానా అని వాపోతాడు.

శాస్త్రానికి సంబంధించిన అంశాలనూ, విచారణలోఉన్న తగాదా న్యాయాన్యాయాలనూ న్యాయవాదులు ముడిపెట్టటాన్ని న్యాయమూర్తులుఎప్పుడూ ఆటంకపరుస్తునే ఉంటారు. అయినప్పటికీ నేటి న్యాయస్థానాలలో సర్వత్రా ఈ శాస్త్రసంబంధ అంశాల ప్రాబల్యత ఉంది. వీటికీ తీర్పులకీ ముడిపెట్టకుండా పనులు జరగడంలేదు.

కేవలం సాంకేతికమైన అంశాలను ఆధారంగా పెట్టుకుని, తగాయిదాల పరిష్కారం ఎంతకీ తెగతెంపులు కాకుండా ఆటంకాలు పెట్టడానికి లేనిపోని ఆలస్యాలు కలిగించడానికి జరిగే ప్రయత్నాలకు ఇకనైనా న్యాయస్థానాలు స్వస్తిచెప్పగలవని విశ్వసిస్తున్నాను.

అప్పీళ్లూ, రివిజనులూ, ఇంకా వాదోపవాదాలను పెంచే పద్ధతులూ అనుసరించడంవల్ల న్యాయవాది వర్గానికి గౌరవంగాని, మర్యాదగాని లభ్యంకాదు. ధర్మము రూఢమై ఖచ్చితమైన సంప్రదాయాలూ అవీ ఏర్పడిఉన్న సందర్భంలో కూడా ఇట్టి పద్ధతులను అనుసరించడం అయోగ్యలక్షణం. హైకోర్టు న్యాయమూర్తులు యీ విషయాన్ని దాపరికం లేకుండానూ, అనుమానాలకు తావులేకుండానూ ప్రపంచించవలసి ఉంటుందని నేను భావిస్తున్నాను.

నేను ప్రాక్టీసుచేసి నేర్చుకున్న గుణపాఠం ఇంకొకటి ఉంది. కోర్టుకువచ్చే ప్రతివ్యక్తికూడా తనకేసును జాగ్రత్తగా వినాలనీ, ఓపికగా పరిశీలించాలనీ వాదప్రతివాదాలు జరుగుతూన్నపుడు న్యాయమూర్తి నిష్కల్మషమైన మనస్సుతో తన వాదాన్ని సమగ్రంగానూ, సక్రమంగానూ ఆలకించాలనీ వాంఛిస్తూ ఉంటాడు. తన ఈ వాంఛ ఈడేరినట్లు తోస్తే తీర్పు కొంచెమేదు చేంతాడు అంత పొడుగువున్నా అతనికి పట్టదు. జయాపజయాలతో కూడా అతను ప్రసక్తి పెట్టుకోడు. గెలిచాడా సరే. లేదా తన కర్మ అనుకుంటాడు. కవి కెల్లాగ తీర్పులను వ్రాస్తూ తీర్పుంటే న్యాయం చెప్పడం కోసం ఏర్పాటయిన సమయం వృథా అయిపోతున్నది. ఆ తీర్పును గూర్చిన రచనకాలానికి అహరిస్తున్నది. శక్తిని క్రమింగుతున్నది. రచన క్లిష్టమవుతున్నది. కోర్టులలో తీర్మానం కావలసిన వ్యవహారం ఎంతో ఉంటుంది. అందువల్లతీర్పు ఎంతసులువుగా వుంటే పని అంత తొందరగా జరుగుతుందని నేను అనుకుంటాను. ఒక కేసులో నూతనమయిన ధర్మాంశం తేల్చవలసి వస్తుంది. నూతనమయిన సంగతులకు న్యాయసూత్రములను పట్టించవలసివస్తుంది. అటువంటి పట్టులో తీర్పును కొంచెము విపులంచి చెప్పడంలో తప్పలేదు. భిన్నమయిన తీర్పు సులువుగా ఉండటమే న్యాయమూర్తికికూడా సులువుఅయిన విషయం. ధర్మాంశాలనుగురించి ధర్మపరిపాలనాన్ని గుర్తించి లాయర్లు కొంత వీటి చేంతాళ్లను పేనుతూ ఉంటారు. కాని ధర్మార్థికి ఇది పట్టదు.

#### ఖర్చులు తగ్గాలి

సంఘ జీవనాన్ని నిర్దుష్టమైన మార్గాలలో నడుపుకోవాలనే కోరిక ఆంధ్ర ప్రజానీకంలో ప్రకృష్టంఅవడంచేతనే ఈ రోజున ఈ హైకోర్టు అవతరిస్తున్నది.

ఇది ఏర్పడటంవల్ల న్యాయం ధర్మం ప్రజలకు సన్నిహితమవుతున్నవి. అందుకు ఈ ప్రయత్నాన్ని అంతా హర్షిస్తారు. న్యాయమూర్తులు కోర్టు ఖర్చులను తగ్గించే పద్ధతులను గూర్చి గూడా ఆలోచిస్తారని నేను భావిస్తున్నాను. ఉదాహరణకు ఒక విషయం చెబుతాను.

కోర్టులలో వ్యవహారపు కాగితాలను వివిధ ప్రాంతీయభాషలనుండి ఇంగ్లీషులోకి మార్చడము చూస్తూఉంటే నాకు ఏమిటో అనిపిస్తుంది. సివిల్ వ్యవహారాలలో సుప్రీంకోర్టుదాకా పోవలసివున్న సందర్భాలు వచ్చినప్పుడు అట్లా చేయడంలో అర్థం ఉంది. తక్కిన సందర్భాలలో న్యాయమూర్తులకు, న్యాయవాదులకు, ధర్మార్థులకు, సాక్షులకూ అందరికీ వచ్చినభాషలో వ్యవహారం నడుపుకోవడం ఎల కూడదో నాకు అర్థం కాకుండాఉంది. అప్పుడు కూడా ఇంగ్లీషు తర్జుమాకని డబ్బుఖర్చు పెట్టడం దాన్ని తగలపెట్టడమే అవుతుంది.

ఈ హైకోర్టు ఏర్పడుతున్న ఈ సందర్భంలో ప్రధాన న్యాయమూర్తికి, ఇతర న్యాయమూర్తులకు, న్యాయవాది వర్గానికీ నా అభివందనలు అందచేస్తున్నాను.

న్యాయాన్ని పాలించడంలో మీరు భారతదేశీయమైన ఉన్నత సంప్రదాయాలను అనుసరిస్తారని నాకు తెలుసు. న్యాయవాదివర్గం వారుకూడా యీ న్యాయస్థానంలో ప్రజలపట్ల తమ ధర్మాన్ని నిర్వర్తించడంలోనే మీ పని చేస్తున్నారని గ్రహించి ఏకాత్మ్యభావంతో పని చేస్తారని కూడా నాకు తెలుసు.

జాతీయ న్యాయస్థానాలలో గడించిన మహా అనుభవాన్ని, సాధించిన మహోజ్జ్వలాన్ని అవసరం వచ్చినప్పుడు దేశంకోసం వినియోగపరచడం ప్రతీ న్యాయవాది యొక్క బాధ్యత అయి ఉంది. మీ న్యాయస్థానము, మద్రాసు న్యాయస్థానమూ సన్నిహితమైన సంబంధాలను పెంచుకొని కాలంతోపాటు పుష్టినీ అనురాగాన్నీ పెంపొందించుకుంటాయని భావిస్తున్నాను. ఈ రెండు న్యాయస్థానాలూ కూడా ప్రోద్బలాన్నీ ఉత్సాహశక్తినీ సంపాదించుకోవాలంటే పూర్వపు మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులు దిద్దిన మార్గాన్నే నడవవలసిఉంటుంది. అందువల్ల ఈరెండు న్యాయస్థానాల మధ్య అనురాగం పెంపొందగలదని నేను అంటున్నాను. ప్రజాశ్రేయస్సుకోసం ఈనూతన న్యాయస్థానం పనిచేసి వారి విశ్వాసాన్ని చూరగొంటుందనీ, మన్ననను గడించుకొంటుందనీ నేను ఆశిస్తున్నట్లే, ఇక్కడ ప్రతి ఒక్కరూ కూడా ఆశిస్తున్నారని నమ్ముతున్నాను.

### "ఆంధ్ర హైకోర్టుకు జయం కలుగు గాక"

#### రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ శుభాకాంక్షలు.

గుంటూరు జులై 5: "ఆంధ్రరాష్ట్రానికి హైకోర్టును స్థాపించడంతో, తమకు ప్రత్యేక పరిపాలన కావాలనే, ఆంధ్రుల మనోవాంఛ పూర్తిగా ఫలించినట్లవుతుంది మద్రాసు హైకోర్టు తదితర హైకోర్టులు స్థాపించిన సత్సంప్రదాయాలను ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులు దృష్టిలో ఉంచుకొని ప్రవర్తిస్తారని ఆశిస్తున్నాను. ఈ కొత్త హైకోర్టుకు జయం కలుగుగాక, అని కోరుతున్నాను అని భారత రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాదు గారు, ఆంధ్ర హైకోర్టు అవతరణోత్సవ సందర్భంలో శుభ సందేశం పంపారు.

"ఇంతవరకూ ఆంధ్రదేశం పైన అధికారాన్ని కలిగి ఉన్న మద్రాసు హైకోర్టుకు, న్యాయమూర్తుల జ్ఞాన ప్రతిభద్వారాను, ప్రజల హక్కులను కాపాడటంలో వారు చూపిన స్వతంత్ర శీల సంపదల ద్వారాను, గొప్ప కీర్తిని సంపాదించి పెట్టారు. ఇంతవరకు ఆంధ్ర తమిళ కన్నడ మళయాళ ప్రాంతీయులు కలసి పెంపొందింపజేసిన సత్సంప్రదాయాలన్నీ ఆంధ్ర హైకోర్టుకు సంక్రమిస్తాయి. భారత రాజ్యాంగం హైకోర్టులకు స్వాతంత్ర్యం ఇవ్వటమే గాక, వ్యక్తులకు సంస్థలకు వ్యక్తులకు రాజ్యానికి రాష్ట్రానికి రాష్ట్రానికి, రాష్ట్రాలకు కేంద్రానికి, మధ్య సమదృష్టితో న్యాయస్థాపన చేయాల్సిన బాధ్యతను కూడా కల్పించింది. మద్రాసు హైకోర్టు ఇతర హైకోర్టులు స్థాపించిన ప్రతిష్టా సంప్రదాయాలను ఆంధ్రా హైకోర్టు న్యాయమూర్తులు దృష్టిలో ఉంచుకొని ప్రవర్తిస్తారని నేను విశ్వసిస్తున్నాను. ఈ కొత్త హైకోర్టుతో సంబంధం కలిగిన న్యాయమూర్తులకు, న్యాయవాదులకు, ఈ హైకోర్టుకు జయం కలగాలని కోరుతూ, ఈ కొత్త హైకోర్టు యొక్క భవిష్యదభివృద్ధిని అత్యంత శ్రద్ధతో గమనిస్తూ ఉంటాను.

#### ఉపరాష్ట్రపతి సందేశం

గుంటూరులో హైకోర్టును స్థాపించిన ఫలితంగా న్యాయం అందరికీ అందుబాటులో ఉండటమే గాక, శీఘ్రంగాకూడా లభించగా ఉంటుందని ఆశిస్తున్నానని భారత ఉపాధ్యక్షులు డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ తమ సందేశంలో తెల్పారు. యీ విషయంలో చాలా శ్రద్ధతీసుకుంటున్న తమ మిత్రుడు డా॥ కైలాస్నాథ్ కట్జూ, ప్రారంభోత్సవం చేస్తున్నందుకు ఆనందం వెలిబుచ్చుతూ, తమకు యీ మహోత్సవానికి వచ్చే వీలులేకపోయినందుకు విచారపడుతున్నారు.

#### శ్రీమాన్ రాజాజీ

ఆంధ్రా హైకోర్టు ఉజ్జ్వలించవలసిందని కోరుకు అనుగాక అని శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి తన సందేశంలో తెల్పారు. చరిత్రాత్మకమైన మద్రాసు హైకోర్టుకు కలిగిన ఈ బిడ్డ యొక్క భవిష్యత్తు ఆంధ్ర ప్రజల చేతుల్లో ఆంధ్రప్రభుత్వపు చేతుల్లో ఉన్నదంటూ. ప్రభుత్వమూ ప్రజలూ "అప్రమత్తులైన దాదులగుదురుగాక" అన్నారు. రాజాజీ తమ సందేశంలో ఇంకా ఇలా అన్నారు: పుత్రాదిచ్ఛేత్ పరాజయం అనేనుడి సఫలం అవాలని తల్లిదండ్రులు వాంఛించటం సహజం. యీ కుమారుడు తన తండ్రికంటె ప్రతిభావంతుడగుగాక. అజరామర యశోవంతులైన ముత్తుస్వామి అయ్యర్, సుబ్రహ్మణ్య అయ్యర్, భాష్యం అయ్యంగార్, మద్రాసు హైకోర్టు న్యాయాధిపస్థానాలను అలంకరించారు; ఆ మహనీయులు తమ దివ్యస్థానాలనుంచి యీ కొత్త హైకోర్టు భవిష్యత్తును ఆశాదృక్కులతో కనిపెట్టూ ఉంటారు. వారికి సంపూర్ణమైన సంతృప్తి ఆనందము కలుగుగాక. న్యాయపీఠము చుట్టూ చేరే న్యాయవాదులు, న్యాయమూర్తులు న్యాయపరిపాలన చేయటంలో తమ ధర్మాన్ని నిర్వహిస్తూ, న్యాయమార్గం తప్పూగ్రస్తం కాకుండా ఉభయులూ [illegible] చేయగలుగుదురు గాక.

#### మధ్యప్రదేశ గవర్నరు డా॥ పట్టాభి సందేశం

సజీవమైనట్టి పటిష్టమైనట్టి ప్రజాభిప్రాయమే న్యాయస్థానాలనుంచి సత్యాన్ని వెలువరించగలదని మధ్యప్రదేశ గవర్నర్ డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు తమ సందేశంలో తెల్పారు. డాక్టరుగారు ఇలా రాశారు: న్యాయశాస్త్రం న్యాయకల్పనకు గల ఉపకరణాల్లో ఒక ఉపకరణం మాత్రమే. సజీవమైన పటిష్టమయిన ప్రజాభిప్రాయమే న్యాయస్థానాలనుంచి సత్యాన్ని వెలువరించగలదు. ఇది జరగాలంటే తగాదా జరిగే చోట్లకు చేరువలో న్యాయవిచారణ జరగాలి. హైకోర్టు అజమాయిషీలో పని చేస్తుండే పంచాయతీ (జుడిషియల్ పంచాయత్స) విస్తృతంగా నెలకొల్పబడినప్పుడే ఇలాటి న్యాయం జరగటం సంభవం. ఒకే భాషా ప్రాంతంలో పనిచేసే సౌకర్యం ఆంధ్రా హైకోర్టుకు లభించింది. అందువల్ల ప్రాంతీయభాష, గ్రామ ప్రజాభిప్రాయం అనే రెండు సహజ మార్గాల ద్వారా న్యాయపరిపాలన సాగించవచ్చు.

#### మాజీ న్యాయమూర్తి శ్రీ ముత్తా వెంకట సుబ్బారావు

ఆంధ్రాహైకోర్టును స్థాపిస్తున్న ఈ చరిత్రాత్మక సమయంలో శుభాకాంక్షలు పంపటం నాకు ఆనందం కలిగిస్తున్నది. తమరాష్ట్రాన్ని సంపాదించుకున్నందుకు ఆంధ్రులు ఉప్పొంగటం సహజమైనది — రాష్ట్రాన్ని పటిష్టం చేయుటంలో హైకోర్టు నిర్వర్తించే పాత్ర చాలా ప్రధానమయినది. ఆంధ్ర హైకోర్టు ప్రథమ ప్రధానన్యాయమూర్తి, అడ్వొకేట్ జనరల్ నాకు సుపరిచితులు, ప్రజల ఆదరాభిమానాలను సంపాదించుకున్నవారు. ఇతర న్యాయమూర్తులు, ఏరు ఉమ్మడి రాష్ట్రంలోని హైకోర్టు యేర్పరచిన సత్సంప్రదాయాలను బాగా అవగతం చేసుకున్నవారు. మద్రాసు హైకోర్టు ఆదర్శమే ప్రస్తుత న్యాయమూర్తులకు న్యాయవాదులకు నీతిరాకృత వారికి ధ్రువతారయై, యీ కొత్తహైకోర్టు ఇతర గొప్పహైకోర్టులతో సమానంగా తులతూగుగాక. నా యీ ఆశ, నిరర్థక స్వప్నతుల్యమైనది గాకుండా, ప్రతివారు ఈ ఆశయసిద్ధి తమపవిత్రధర్మంగా పరిగణింతురు గాక అని ప్రార్థిస్తున్నాను."

#### న్యా॥ ఎ. యస్. వి. అయ్యర్

ఆంధ్రదేశం ఇదివరకు ఆపస్తంబుని కన్నది. ఇంక ఆంధ్రదేశం అనేక మనువులను, యాజ్ఞవల్క్యులను, ఆపస్తంబులను కనుగాక అని ప్రార్థిస్తున్నాను. మీరు హైకోర్టును కొత్తగా స్థాపించుకొంటున్నారు. శ్రీ సుబ్బారావు ప్రధాన న్యాయమూర్తిగాను, శ్రీయుతులు చంద్రారెడ్డి, ఉమామహేశ్వరం గారలు న్యాయమూర్తులుగాను, శ్రీ విశ్వనాథం న్యాయమంత్రిగా, ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు ముఖ్యమంత్రిగాను గల మీరు శ్రద్ధతో పని చేస్తారని నాకు విశ్వాసం.

#### మద్రాసు గవర్నరు శ్రీ శ్రీప్రకాశ

గొప్ప న్యాయవాది, కేంద్ర హోం మంత్రి డా॥ కట్జూ ఈ హైకోర్టును ప్రారంభోత్సవంచేయ వస్తున్నారని చాలా ఆనందిస్తున్నాను. ఈ హైకోర్టు చాలా శుభప్రదంగా ఆరంభమవుతున్నది. ఈ హైకోర్టు న్యాయ వసుత్వాలను నిలబెట్టటంలో సత్సంప్రదాయ ప్రేరితమై, న్యాయాన్ని స్వాతంత్ర్యాన్ని పరిపాలించటంలో అత్యంత ప్రయోగకరసంస్థగా అభివృద్ధి చెందగలదని ఆశిస్తూ అందరికీ నా శుభాకాంక్షలు అందిస్తున్నాను.

#### లోకసభ అధ్యక్షుడు శ్రీ జి. వి. మౌలంకర్

ఈ క్రొత్త హైకోర్టు భావస్వాతంత్ర్య రక్షణకు, పౌరసత్వాల రక్షణకు పెట్టని కోటయై, ఇతర గొప్పన్యాయస్థానాలు పెట్టిన ప్రమాణాలను అనుసరిస్తూ పనిచేస్తుందని ఆశిస్తూ ప్రారంభోత్సవం విజయవంత మవుగాక అని కోరుతున్నాను.

#### మాజీ న్యాయమూర్తి శ్రీ వేపా రామేశం

వృద్ధాప్యపు అనారోగ్యంవల్ల యీ శుభమహోత్సవంలో పాల్గొన వీలులేక పోయింది. నా శుభాకాంక్షలన్నీ యీ మహోత్సవం మీదనే కేంద్రీకృతమై ఉన్నాయి.

ఇంకా ఈ క్రిందివారు గూడా తమ శుభసందేశాలను పంపారు: ఒరిస్సా గవర్నరు శ్రీ పి. ఎస్. కుమారస్వామి రాజా, ఆంధ్ర విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ శ్రీ బి. గోపాలరెడ్డి, హైదరాబాదు మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ రామచంద్ర నాయక్, నాగపూర్ మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎం. బి. నియోగి, మైసూరు ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎం. మాదప్ప, బొంబాయి ప్రధాన న్యాయమూర్తి యం. సి. చాగ్లా, నాగపూర్ ప్రధాన న్యాయమూర్తి బి. పి. సిన్హా, బెంగాల్ ప్రధాన న్యాయమూర్తి, రాజకోట ప్రధాన న్యాయమూర్తి, సుప్రీంకోర్టు న్యాయమూర్తులు శ్రీయుతులు వెంకటరామఅయ్యర్, గులాం హసన్, హైదరాబాదు హైకోర్టు న్యాయమూర్తులు శ్రీయుతులు జగన్మోహన్ రెడ్డి, శ్రీనివాసాచారి, విఠల్ రావ్ జోశీ పాండే, మద్రాసు న్యాయమూర్తులు శ్రీయుతులు కృష్ణస్వామి నాయుడు, రాజగోపాలన్, ఇ. ఇ. మ్యాక్, రామస్వామి గౌండర్, బాలకృష్ణ అయ్యర్, బషీర్ అహమద్ సయ్యద్, ఎన్. సోమసుందరం, మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ నాడార్, మైసూరు ముఖ్యమంత్రి శ్రీ హనుమంతయ్య, మద్రాసు మంత్రులు శ్రీ భక్తవత్సలం, శ్రీ పరమేశ్వరన్, లోకసభ్యుడు శ్రీ బి. రామచంద్రారెడ్డి గారలు.

### శ్రీ రాజమన్నారు ప్రసంగం

(1 వ పేజీ తరువాయి)

సిటీ సేటు వదలి ప్రజలు మరో ప్రాంతానికి వలసవెళ్లి ఒక కాలనీ యేర్పాటు చేసినప్పుడు తాము పూర్వం నివసించిన సిటీస్టేటునుంచి అగ్ని పట్టుకొని వెళ్లేవారు. అలాగే, యీనాడు ఆంధ్ర హైకోర్టు, మద్రాసు హైకోర్టులో పనిచేసిన మువ్వురు న్యాయమూర్తులతో ప్రారంభమవుతున్నది. సుప్రసిద్ధులైన న్యాయమూర్తులు మద్రాసు హైకోర్టుకు యేర్పాటు చేసిన ఉత్తమ సంప్రదాయాలు, ఉన్నత ప్రమాణాలు, విజ్ఞానం, నిజాయితీ-యివన్నీ కొత్త ఆంధ్ర హైకోర్టుకు, యీ న్యాయమూర్తులు, తమవెంట తీసుకొని వస్తున్నారనుట స్పష్టం. మద్రాసు హైకోర్టుకు సంబంధించిన పై విశిష్ట లక్షణాలన్నీ, ఉండబోతున్నందున, యిది కేవలం కొత్త హైకోర్టుగా పరిగణించ వీలులేదు.

ఆంధ్ర హైకోర్టుకు ఒకవీలుగూడా ఉన్నది. మద్రాసు హైకోర్టులో, ప్రస్తుత కాలానికి, అనుగుణంగా లేకపోయినా నిరుపయోగకరమైనా అనాదిగా వస్తుండడంచేత మద్రాసుహైకోర్టు అంటిపెట్టుకొని వున్న సంప్రదాయాలను ఆచారాలను త్యజించి, ఆంధ్ర హైకోర్టు సరికొత్త సంప్రదాయాలను ఆచారాలను, ఏర్పాటు చేసుకొని అనుసరించవచ్చు. మద్రాసు హైకోర్టు, ఆంధ్ర హైకోర్టులకు ఎంత సామీప్యత వున్నదో మద్రాసు, ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు గూడా అంత దగ్గరబంధువులు కావడం గూడా విచిత్రమైన విషయమే. ఈ బాంధవ్యం, రెండు హైకోర్టుల అన్యోన్య సంబంధాలకు చిహ్నమని నా నమ్మకం.

ఏ రాష్ట్రంలోనైనా, అదేవిధంగా ఆంధ్ర రాష్ట్రంలో గూడా ప్రజాస్వామ్యం జయప్రద మవడమనేది చాలామట్టుకు, ఆంధ్ర హైకోర్టు స్వాతంత్ర్య, నిష్పక్షపాత, నిజాయితీలపై ఆధారపడివుంటుంది. విజ్ఞాననిధులైన ఆంధ్ర న్యాయమూర్తులు, ఈ ఉత్తమ లక్షణాలను కాపాడుటకు సర్వదా కృషి చేస్తారని నిస్సందేహంగా భావిస్తున్నాను.

న్యాయస్థానాలు, న్యాయమూర్తులు పవిత్ర ఉపకరణాలలో, ఆ పరమేశ్వరుడు ఆంధ్ర హైకోర్టును ఆశీర్వదించుగాక.

## ఉస్మానియా విశ్వకళా పరిషత్తు

### ప్రముఖుల అభిప్రాయ సేకరణకు విద్యాప్రవీణుల సంఘ నిర్ణయం

హైద్రాబాదు, జూలై 3: భారత ప్రభుత్వం నియమించిన విద్యాప్రవీణుల సంఘం డా॥ జకీర్ హుస్సేన్ అధ్యక్షతన ఇవాళ ఇక్కడ సమావేశమై, ఉస్మానియా విశ్వకళా పరిషత్తు విధివిధ్య నిర్ణయంపై ప్రముఖ వ్యక్తుల, సంస్థల అభిప్రాయాలను సేకరించటానికి నిర్ణయించింది.

విద్యాప్రవీణుల సంఘ ప్రథమ సమావేశం పూర్తికాగానే శ్రీ జకీర్ హుస్సేన్ పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ తాము అభిప్రాయాల సేకరణకు ఆహ్వానించే వ్యక్తులు ప్రధానంగా విశ్వవిద్యాలయం నుంచేననీ, వారు కాక కొంతమంది ప్రముఖులనూ, భాషా సంస్థలనూ ఆహ్వానిస్తామనీ తెలియజేశారు. మొత్తం వందమందిని పిలవవచ్చుననీ, ఆగస్టులో తమ పనిపూర్తికాగానే తమ నివేదికను సమర్పిస్తామనీ వివరించారు.

అభిప్రాయాల సేకరణకు అనుసరించవలసిన విధానాన్ని, ఆహ్వానించదలచిన వ్యక్తుల, సంస్థల జాబితానూ రూపొందించారు.

ఈ సంఘం తిరిగి రేపు సమావేశమై కొన్ని సాంకేతిక విషయాలను చర్చించిన మీదట సమావేశం ముగిస్తుంది. తిరిగి ఆగస్టు మధ్యలో వివిధ వ్యక్తుల, సంస్థల ప్రతినిధుల అభిప్రాయాలను తెలుసుకోటానికి సమావేశమవుతుంది.

శ్రీయుతులు బి. బి. డే, డాక్టర్ అబ్దుల్ హక్, ప్రొఫెసర్ ఏ. ఆర్. వాడియా, డా॥ ఎస్. భగవంతం, మూడపాటి హనుమంతరావు, కృష్ణాచారి జోషీ గారలు హాజరైనారు. ఈ సమావేశానికి శాసనసభా స్పీకర్ కె. ఎస్ వైద్య, డా॥ ధాకర్ గారలు రాలేదు. (స్వ. వి.)

## మద్రాసులో న్యాయ కార్య శాఖల విభజన

మద్రాసు, జూలై 4: న్యాయకార్యశాఖల విభజనను మద్రాసు పట్టణానికి కూడా వర్తింప చెయ్యడానికి మద్రాసు ప్రభుత్వంవారు నిశ్చయించారు. ... రాష్ట్రమంతటా ఈ విభజన పూర్తి అవుతుంది.

## ప్రపంచశాంతికై మహా క్రతువు

బదరీనాథ్, జూలై 3: ప్రపంచ శాంతి సౌభాగ్యాల నిమిత్తం శ్రీమదష్ట కుటీ కోటియాగ మహాక్రతువు మొన్న జూన్ 21వ ఇక్కడ ప్రారంభమయింది. దేశం అన్ని ప్రాంతాలనుంచీ 150 మంది పండిత ప్రకాండులు వచ్చి పాల్గొంటున్నారు. ఈ జపాను స్థాన యజ్ఞం 56 రోజులపాటు జరిగి ఆగస్టు 14వ పరిసమాప్తమవుతుంది. ఇందుకు 6 లక్షల రూపాయలు వ్యయమవుతాయని అంచనా వేశారు.

## మద్రాసు నగరంలో సంచార న్యాయ స్థానాలు

మద్రాసు, జూలై 4: మద్రాసు నగరంలో మూడు సంచార న్యాయస్థానాలను నిర్మించడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు. ఆరు నెలలు ముందు ఇవి పని చేస్తాయి. రస్తాలపై చిల్లు వరకేవ నేరాలను వీధులు పాడు చేసిన నేరాలను వీరు విచారిస్తారు. ముగ్గురు గౌరవ మేజస్ట్రేట్లు ప్రతిరోజూ పని చేస్తారు. ఆదివారంతప్ప మిగతా రోజుల్లో కోర్టులు రోజుకు రెండు గంటల చొ॥న పని చేస్తాయి.

## మన్ననూరు అడవులలో తుపాకులు

హైద్రాబాదు, జూలై 3: మహబూబ్ నగర్ జిల్లాలోని మన్ననూరు అడవులనుంచి ఒక బ్రెన్ తుపాకి, 4 సబ్-మెషిన్ తుపాకులు, 3 చేతి తుపాకులు, ఒక రివాల్వర్ లను మర్యాల గూడెం పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. (స్వ. వి.)

## బాపుజీ హరిజన సంఘ కార్యాలయం

మద్రాసు, జూలై 4: పెరంబూరు గాంధీ నిలయంలో బాపూజీ హరిజన సేవా సంఘ కార్యాలయమునకు గత శనివారం ప్రారంభోత్సవం జరిగింది. తర్వాత శ్రీ రాఘవయ్యగారధ్యక్షతన బహిరంగసభ జరిగింది. అధ్యక్షులుగా బొప్పన హనుమంతరావుగారిని, మూర్తి కార్యవర్గాన్ని ఎన్నుకున్నారు.

## పరిశ్రమలశాఖ డైరెక్టరు ప్రకటన

మద్రాసు, జూలై 4: ఆంధ్ర(రాష్ట్ర) పరిశ్రమల శాఖ డైరెక్టరు ఈ విధంగా ప్రకటిస్తున్నారు. "పరిశ్రమల సహాయ చట్టం 8వ సెక్షనుకింద ప్రభుత్వ సహాయానికి చాలా తక్కువ దరఖాస్తులు డిపార్టుమెంటువారి విచారణలో ఉన్నవి. చట్టం క్రింద సహాయం కావలసినవారు యుక్తమైన పద్ధతిని నిర్ణయించి దరఖాస్తులు సంపాదించి [illegible] ... కార్యాలయంనుంచి తీసుకోనవచ్చును."

## ఆంధ్ర, తెలంగాణా ప్రజాప్రతినిధులు

### సమావేశపరచడానికి శ్రీ చిదానందం ప్రయత్నం

సికింద్రాబాదు, జూలై 4: ఆంధ్ర, తెలంగాణా శాసనసభ్యుల, పార్లమెంటు సభ్యుల, ప్రముఖ తెలుగు నాయకుల సమావేశాన్ని ఆగస్టు రెండవవారంలో తెలుగుప్రాంతాల భవిష్యత్ నిర్ణయించటానికి ఏర్పాటు చేస్తున్నామని రాయలసీమ శాసనసభ్యుడు వి. చిదానందంగారు ఇక్కడ పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

రాయలసీమ స్వతంత్ర శాసనసభ్యుడు వి. చిదానందం, కర్నూలు వర్తకులసంఘ అధ్యక్షుడు ఇల్లూరి యల్లయ్యగారలు నిన్న ఇక్కడ రాష్ట్రాల పునర్నిర్మాణ సంఘాధ్యక్షుడు ఫజల్ అలీని కలుసుకున్నారు. ఆగస్టు రెండవ వారంలో కర్నూలు వచ్చినప్పుడు నివేదికను తీసుకోనటానికి అంగీకరించారు.

## సర్దార్ పణిక్కర్

హైద్రాబాదు, జూలై 4: రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ సంఘ సభ్యులలో ఒకరైన సర్దార్ పణిక్కర్ ఇక్కడనుంచి 9వ తేదీన మద్రాసుకు వెడతారని భావించబడుతోంది. ఛైర్మన్ ఫజల్ అలీ, హృదయనాథ్ కుంజ్రూ గారలు మటుకు రాష్ట్రంలో ఉండి తమ సాక్ష్యాల సేకరణను జరుపుతారు.

## ఫజల్ అలీ కమీషన్ నాందేడుకు పయనం

(స్వకీయ విలేఖరి)

హైద్రాబాద్, జూలై 4: ఫజల్ అలీ కమిషన్ సభ్యులు ఇవాళ రాత్రి నాందేడ్ కు బయలుదేరి వెడుతున్నారు. తిరిగి హైద్రాబాద్ కు 9వ తేదీకి చేరుకుంటారు.

హైద్రాబాద్ విద్యామంత్రి గోపాలరావు ఎక్బోటే, డిప్యూటీ మంత్రి సంగం లక్ష్మీబాయి, రాష్ట్ర శాసనసభ డిప్యూటీ స్పీకర్ పంపన గౌడ, హిందూమహాసభ ప్రతినిధులు, మరి కొందరు ఇవాళ కమిషన్ ను కలుసుకున్నారు.

హిందూ మహాసభ ప్రతినిధులు హైద్రాబాద్ రాష్ట్రాన్ని విభజించి, భాషారాష్ట్రాలను నిర్మించవలసిన ఆవశ్యకతను స్పష్టీకరించారు.

డిప్యూటీ మంత్రి శ్రీమతి సంగం లక్ష్మీబాయిగారు తెలంగాణా ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకోటానికి 'ప్లెబిసైట్' తీసుకుంటే, ఎక్కువమంది హైద్రాబాద్ ను విడతోటాలనీ, విశాలాంధ్రవద్దనీ ఓటు చేస్తారనీ, ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరుతారనీ తెలియజేసినట్లు భావించబడుతోంది.

కె. వి. నారాయణరెడ్డి, ఎమ్.ఎల్.ఏ. కె. కె. ప్రకాశ్ చర్య, ఎమ్. ఎల్. ఏ. యునైటెడ్ ప్రజాపార్టీ షరన్ గౌడా, కె. ఎల్. సంఘీ, వాణిజ్యవేత్త శ్రీనివాసబద్రూకు గారలు కూడా కలుసుకుని తమ అభిప్రాయాలను వ్యక్తపరిచారు.

## గోవాలో ఇటీవలి పరిణామాలు

### బొంబాయి ముఖ్యమంత్రితో ఆర్. కె. నెహ్రూ సంప్రతింపులు

బొంబాయి, జూలై 3: గోవాలో ఇటీవలి పరిణామాల గురించి బొంబాయి ముఖ్యమంత్రి మురార్జీ దేశాయితో సంప్రతించటానికి నాలుగురోజులక్రితం ఇక్కడికి వచ్చిన విదేశాంగ వ్యవహారాల శాఖ కార్యదర్శి ఆర్. కె. నెహ్రూ నేడు ఢిల్లీ వెళ్లారు. ఈయన త్వరలోనే మద్రాసు ముఖ్యమంత్రితో సంప్రతింపుల నిమిత్తం అక్కడికి వెడతారని తెలిసింది.

గోవన్ అసోసియేషన్ కార్యదర్శి, ఇండో పోర్చుగీసు ఇక్ స్టిట్యూటు గౌరవ కార్యదర్శిఅయిన పాంపియా శెగాస్ భారతప్రభుత్వ నిషేధ ఉత్తరువు ప్రకారం నిన్న బొంబయినుంచి గోవా వెళ్లిపోయారు.

## ఉపన్యాసాలంటే నెహ్రూ విరక్తి

సిమ్లా, జూలై 4: ప్రతి సందర్భాన్ని ఒక బహిరంగసభ చేయటం తనకిష్టం లేదని ప్రధాన మంత్రి నెహ్రూ ఇవాళ ఇక్కడ హిమాచల ప్రదేశ్ ప్రభుత్వోద్యోగులు పదిసుంది చేరిన ఒక సమావేశంలో అన్నారు. ఆరాష్ట్ర లెఫ్టినెంట్ గవర్నర్ జనరల్ హిమ్మత్ సింహజీ ఇంట్లోనే ఈ సమావేశం జరిగింది. ఉద్యోగులంతా ప్రధాన మంత్రి చెప్పేది వినటానికి వచ్చి లకోసం చక్కగా పడుల్లా వేచి వున్నారు. ప్రధానివచ్చి, కొన్ని రోజుల క్రితం హిమ్మత్ సింహజీ తను ఉద్యోగులకు దర్శనమివ్వవలసిందిగా తమను కోరారనీ, అందుకు తాము సంసిద్ధత తెలిపారనీ, ఉద్యోగులను తామూ, తమను ఉద్యోగులూ చూడటానికే తామిక్కడికి వచ్చారు కాని ఉపన్యాసాలు ఇవ్వటానికి కావటంలేదని అన్నారు. అయినా, ఉద్యోగులు, మనసుపెంచాలని చీఫ్ కోరిన మీదట నెహ్రూ కొంచెప్ప ప్రసంగించారు.

## కొండలు నేలమట్టం చేయడానికి అణ్వాస్త్రాలు

### రష్యా ఇదివరకే వినియోగించిందట

లండన్, జూలై 3: కొండలూ, గుట్టలూ నేలమట్టం చేయడానికీ జలప్రవాహాలకు అవరోధాలు తొలగించడం వంటి పనులకు రష్యా ఇదివరకే అణ్వాస్త్రాలను వినియోగించినదని నవస్టైనా వార్తా సంస్థ నేడు ప్రకటించింది.

ఇంతకుమించి వివరాలు విడుదల చేయలేదు.

టర్కీస్థాన ఎడారిలో, కొత్త పరిశ్రమ కేంద్రం ఏర్పాటు చేయడానికి 1949లోనే రష్యా తొలిసారిగా అటంబాంబు వినియోగించిందని నిన్నరాత్రి బుడాపెస్టు రేడియో సూచించింది.

ఇరాన్ ఈశాన్య సరిహద్దు సమీపాన, ఈ టర్కీస్థాన్ కొరాకుం ఎడారిలో ఉన్న ఒక పర్వతాన్ని ఛిద్రం చేయడానికి రష్యా తొలిసారిగా అటంబాంబు వినియోగించిందని ఈ రేడియో పేర్కొంది.

ఇటీవల రష్యాలో అటం విద్యుదుత్పత్తి కేంద్రం నెలకొల్పబడినట్లు వెలువడిన వార్తపై వ్యాఖ్య చేస్తూ హంగరీ పత్రిక జాబాద్ పరిశ్రమలకై రష్యా అణ్వస్త్రాలను ఇదివరకే వినియోగించిందని పేర్కొన్నది.

రష్యా తొలి అటంబాంబు ప్రేల్చుడుగురించి 1949 సెప్టెంబరులో బ్రిటన్ అమెరికా, కెనడాలు ఒక సమిష్టి ప్రకటన చేశాయి.

## బాల్కన్ రాజ్యాల సైనిక ఒడంబడిక

ఏథెన్సు, జూలై 3: బాల్కన్ రాజ్యాలమధ్య సైనిక ఒడంబడిక నొకటి ఏర్పాటుచేసే నిమిత్తం గత వారంరోజులుగా సమావేశమౌతున్న గ్రీసు, టర్కీ, యూగోస్లావ్ సంఘాల ఈ పూర్తి అంగీకారం కుదిరిందని గ్రీకు విదేశాంగశాఖ ఉద్యోగి ఒకరు నేడు వెల్లడించారు.

సోమవారంనాడు జరిగే తుది సమావేశంలో వీరు రూపొందించిన ఒప్పందపు చిత్తుప్రతి ప్రకటించబడుతుందని ఈ ఉద్యోగి అన్నారు.

## అరబ్ సరిహద్దుల రక్షణ

### జోర్డాన్ మంత్రి వినతి

అమాన్, జూలై 3: అరబ్ సరిహద్దులను-ముఖ్యంగా జోర్డాన్ నూ ఇజ్రాయేలు దురాక్రమణల బారినుంచి రక్షించడానికి తగిన చర్యలు తీసుకోమని ఇక్కడి అరబ్ రాజకీయ ప్రతినిధులు తమ తమ ప్రభుత్వాలను కోరవలసిందని జోర్డాన్ విదేశాంగమంత్రి అభ్యర్థన చేశారు.

అరబ్ రాజ్యాల సమిష్టి ఒడంబడికననుసరించి ఈయన ఈ అభ్యర్థన చేశారు.

జరూసలెంలో ఇజ్రాయేలు స్థావరాలనుంచి అరబ్ ప్రాంతంపైకి అప్పుడప్పుడు కాల్పులు జరుగుతునే ఉన్నవని ఇక్కడికి వార్తలు వస్తున్నవి.

నాలుగురోజులనుంచి ఈ విధంగా కాల్పులు జరుగుతున్నవి.

## వ్యవసాయ, పశు వైద్య కళాశాలలు

### బాపట్లలో 9న సెలెక్షన్ కమిటీ సమావేశం

బాపట్ల, జూలై 3: వ్యవసాయకళాశాల (బాపట్ల) పశువైద్య కళాశాల (మద్రాసు) సీట్ల నిర్ణయానికి ప్రభుత్వం నియమించిన విద్యార్థులను ఎన్నుకొనే నిర్ణాయక సంఘం ఇక్కడ 9వ తేదీన సమావేశమవుతుంది. మద్రాసు పశువైద్య కళాశాల సీట్లకు విద్యార్థుల నిర్ణయం 9, 10, 11వ తేదీలలో జరుగుతుంది. బాపట్ల వ్యవసాయ కళాశాల సీట్ల నిర్ణయం 12, 13, 14వ తేదీలలో జరుగుతుంది. ఈ నిర్ణయానికి కావలసిన ప్రాథమిక ఏర్పాట్లన్నీ చేయబడ్డాయి. (స్వ. వి.)

## మానసిక రోగ పరిశోధనా కేంద్రం

మైసూరు, జూలై 4: కేంద్ర ప్రభుత్వమువారు బెంగుళూరులో మానసిక రోగ పరిశోధనాలయాన్ని సంవత్సరము 1కి సుమారు $1\frac{1}{2}$ లక్షరూపాయల ఖర్చుతో నిర్మించడానికి నిశ్చయించినారు. ఈ సందర్భంలో కేంద్ర ఆరోగ్యశాఖా ఉపమంత్రిణి శ్రీమతి మరకతం చంద్రశేఖరంగారు బెంగుళూరు వచ్చినారు. ప్రస్తుతం బెంగుళూరులోవున్న పిచ్చిఆసుపత్రిని అధునిక యంత్ర పరికరాలతో $4\frac{1}{2}$ లక్షల రూపాయల ఖర్చుతో అభివృద్ధిచేయటానికి నిశ్చయించినారని శ్రీమతి మరకతంగారన్నారు. మైసూరు మహారాజా కళాశాల ప్రిన్సిపాలుగానూ, మనశ్శాస్త్ర ప్రొఫెసరుగానూ పనిచేసి విరమించుకొన్న డాక్టర్ ఎం. వి. గోపాలస్వామిగారిని పై పరిశోధనా పరిశోధనాధికారిగా నియమించారు. స్వ. వి.

## సామాజిక ఆర్థిక విప్లవం

### యువకుల కర్తవ్యంపై అగర్వాల్ ఉద్బోధ

అకోలా, జూలై 4: "సామాజిక, ఆర్థిక సమానత్వంలేని రాజకీయస్వాతంత్ర్యం నిస్సారమయినది. శాంతియుతంగా ప్రజాస్వామిక పద్ధతులలో యీ మహావిప్లవం సాగించడానికి కాంగ్రెస్ నిశ్చయించింది. ఇందులో భారతీయ యువజనులు అత్యంత ప్రధానమయిన పాత్ర నిర్వహించవలసి వుంది. గాంధీజీ కలలుకన్న స్వరాజ్యాన్ని స్థాపించడమే దీనిఆశయం" అని కాంగ్రెసు కార్యదర్శి ఎస్. ఎన్. అగర్వాల్ ఇవాళ ఉద్ఘాటించారు.

విదర్భప్రదేశ్ యువజన సమావేశంలో ప్రసంగిస్తూ, నియంతృత్వ పద్ధతులూ, దౌర్జన్యవిధానాలూ ఉపయోగించడంవల్ల చిక్కులువిడి, మార్గంకనపడడానికి బదులు లేనిపోనిచిక్కులు ఏర్పడతాయని, ఇటువంటి విధానాలను కాంగ్రెస్ వ్యతిరేకిస్తుందని ఆయన అన్నారు. ఈ సమావేశానికి అగర్వాల్ అధ్యక్షత వహించారు.

ఇటీవల ఇండియా చైనా ప్రధానులు చేసిన సంయుక్త ప్రకటనగురించి ప్రస్తావిస్తూ, ఆసియాదేశాలు తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలవనీ, ఇందులో పశ్చిమ రాజ్యాలసహాయం అనవసరమనీ యీ ప్రకటన స్పష్టంగా వెల్లడిచేస్తున్నదని అగర్వాల్ అన్నారు.

భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని అమ్ముకోదు. స్వయంశక్తిపైన ఆధారపడి పురోగమిస్తుంది. ప్రపంచంలోని రెండుకూటాలలోనూ ఏ ఒక్కదానికీ చెందకుండా స్వతంత్రంగా వ్యవహరించగలదు అని ఆయన ఉద్ఘాటించారు.

ఈ సమావేశాన్ని కేంద్ర ఆహార మంత్రి రఫీ అహమ్మద్ కిద్వాయ్ ప్రారంభం చేస్తూ, స్వాతంత్ర్యం సిద్ధించిన అనతికాలంలోనే ఆహార, వస్త్రాల ఉత్పత్తి, పరిశ్రమలూ ఎంతో అభివృద్ధి చెయగలిగామని, యువజనులందరూ ఇతరదేశాల చరిత్రలు చదివి అవగాహన చేసుకుని, మన దేశాభివృద్ధికి గట్టిగా కృషి చేయాలని ఉద్బోధించారు.

## ఫ్రెంచిఇండియా ఉద్యోగులు

### నాలుతారా పరిపాలన సంఘ నిర్ణయం

పాండిచేరి, జూలై 3: ఇటీవల ఫ్రెంచి అధికారాన్నుంచి విముక్తి పొంది, స్వాతంత్ర్యం ప్రకటించిన ఫ్రెంచి మాహేలంక "నాలుతారా" పరిపాలన సంఘంవారు నేడు సమావేశమై మొన్నటివరకూ ఫ్రెంచి యిండియా ప్రభుత్వోద్యోగులుగా ఉన్నవారిలో కొందరిని ఈ కొత్త పరిపాలనా వ్యవస్థలో పనిచేయవలసిందని ఆహ్వానించారు.

వీళ్లకి, ఇదివరకే జీతబత్తాలే ఇస్తామనీ, ఇదివరకటి ఉద్యోగ నిబంధనలే వర్తింపచేస్తామనీ యీ పరిపాలనా సంఘంవారు హామీయిచ్చారు.

నాలుతారాకు సంబంధించిన న్యాయశాఖ వ్యవహారాలన్నిటినీ చక్కపెట్టడానికై ఒక ప్రత్యేకోద్యోగిని నియమించాలనివీరుతీర్మానించారు.

వేనరకుగా ఫ్రెంచి మాహే విమోచన కోరుతూ, యేకగ్రీవ తీర్మానం చేసిన కౌన్సిలర్లనీ, ప్రతినిధులను మాహే మేయరు సహదేవన్ గారినీ అభినందిస్తూ మరొక తీర్మానం చేశారు.

## ఇండియా పాకిస్థానల్లో ఆలయ పరిరక్షణ

### ఉభయప్రభుత్వాల ఒప్పందం

న్యూఢిల్లీ, జూలై 3: ఇండియా, పాకిస్థాన్ దేశాలలోని దేవాలయాల పరిరక్షణకూ, వాటి పవిత్రత కాపాడడానికి తగిన చర్యలు తీసుకోడానికి ఇరు ప్రభుత్వాలమధ్యా ఒప్పందం కుదిరింది.

ఇరు దేశాలకు చెందిన పవిత్ర స్థలాలూ ఆలయాలూ పరిరక్షించే విషయమై గత జూలై ఆగస్టు నెలలలో ఇరు ప్రభుత్వాల ప్రతినిధులూ సమావేశమై చర్చలు జరిపారు.

ఇప్పుడు ఇండియా పాకిస్థాన్లు కలిసి ఒక అంగీకారానికి వచ్చాయి.

ఒక్క ఆలయాలూ మసీదులే కాక, చారిత్రాత్మకమైన శివనాలు కూడా కాపాడాలనీ, చెడిన వాటికి మరమ్మతు చేయించాలనీ కూడా వీరు నిశ్చయించారు.

ఉత్సవ సందర్భాలలో యాత్రికులు ఇరుదేశాలనుంచి రాకపోకలు సాగించడానికి వీలుగా ఏర్పాట్లు చేయడానికి ఎక్కువ మందికి అనుమతు లివ్వడానికి, నారికరకుణ, వగైరా సదుపాయాలు ఏర్పాటు చేయడానికి కూడా పరస్పర అంగీకారం కుదిరింది.

## ఉద్యోగ వార్తలు

కర్నూలు, జూలై 3: అనంతపురం ఆయిల్ టెక్నాలజికల్ ఇన్స్టిట్యూట్ ప్రిన్సిపాల్ కె. ఎస్. మూర్తిగారికి జూన్ మొదటి తేదీనుంచి రెండు నెలల సెలవు మంజూరయింది.

లేంజర్ కె. రాఘవయ్యగారు తాత్కాలికంగా అడవులశాఖ అసిస్టెంట్ కన్సర్వేటరుగా నియమించబడ్డారు.

నెల్లూరు మున్సిపల్ ఆరోగ్య శాఖాధికారి పి. నారాయణరెడ్డిగారు రిటైరయ్యేముందు సగటు జీతం పద్ధతిలో జూన్ 7వ తేదీనుంచి నాలుగు నెలల సెలవు మంజూరయింది.

డాక్టరు ఎ. రామనాథన్ గారిబదులు విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలో బయోకెమిస్ట్రీ ప్రొఫెసరుగా మద్రాసులోని స్టాన్లీ కాలేజిలో కెమిస్ట్రీ లెక్చరరు చి. నాగన్నగారు తాత్కాలికంగా నియమించబడ్డారు.

ట్రెయినింగ్ పూర్తిఅయిన తరువాత విశాఖపట్టణం అసిస్టెంట్ కలెక్టరు విజయనగరం సబ్ కలెక్టరుగా పనిచేస్తారు.

ప్రభుత్వ న్యాయశాఖ సహాయ కార్యదర్శి వి. ఎ. వెంకటాచలపతిగారికి జూన్ రెండవ తేదీ నుంచి జూలై మొదటి తేదీ వరకు సెలవు మంజూరయింది.

రాజమండ్రిలోని మతాదాయ దేవాదాయశాఖ అసిస్టెంట్ కమిషనర్ (అడ్మినిస్ట్రేషన్) టి. రామదాస్ గారు విజయనగరం అసిస్టెంట్ కమిషనరుగా నియమించబడ్డారు. రాజమండ్రిలో ఆశాఖ అసిస్టెంట్ కమిషనరుగా టి. నీలాద్రి రావ్ నాయుడుగారు నియమించబడ్డారు.

విజయనగరంలోని మతాదాయ ధర్మాదాయశాఖ అసిస్టెంట్ కమిషనరు(పరిపాలనానిర్వహణశాఖ) యన్. వెంకటకృష్ణయ్యగారిని ఆ వుద్యోగం నుంచి టి. రామదాస్ గారు విడుదల చేసిన తరువాత ఏలూరు అసిస్టెంట్ కమిషనరుగా నియమించారు.

ఏలూరు మతాదాయ ధర్మాదాయశాఖ అసిస్టెంట్ కమిషనరు (అడ్మినిస్ట్రేషన్) కె. రామకృష్ణప్పగారిని ఆ వుద్యోగం నుంచి వెంకటకృష్ణయ్యగారు విడుదల చేసిన తరువాత రామకృష్ణప్పగారు బందరు అసిస్టెంట్ కమిషనరుగా పని చేస్తారు.

ఫస్టుక్లాస్ మేజస్ట్రేట్ ఆర్. వి. సీతారామారావ్ గారు అనంతపురం జిల్లా మేజస్ట్రేట్ గా నియమించబడ్డారు. గుత్తి ప్రధాన కేంద్రంగా ఆయన పని చేస్తారు.

ఫస్టుక్లాస్ మేజస్ట్రేట్ ఆర్. భాస్కరరావ్ గారు చిత్తూరు జిల్లా మేజస్ట్రేట్ గా నియమించబడ్డారు. నెల్లూరు ప్రధాన కేంద్రంగా ఆయన పని చేస్తారు.

కృష్ణాజిల్లాలో ఫస్టుక్లాస్ మేజిస్ట్రేట్ ఆర్. ఎస్. ప్రకాశరావ్ గారు జిల్లా మేజిస్ట్రేట్ అధికారాలన్నింటితో అడిషనల్ జిల్లా మేజస్ట్రేట్ గా పని చేస్తారు.

తూర్పు గోదావరి జిల్లాలోని ఫస్టుక్లాస్ మేజస్ట్రేట్ మహమ్మద్ ఫజులుల్లా షరీఫ్ గారు జిల్లా మేజస్ట్రేట్ అధికారాలన్నింటితో అడిషనల్ జిల్లా మేజస్ట్రేటుగా పని చేస్తారు.

కడపలోని హైవేస్ శాఖ రెండవ సర్కిల్ సూపరింటెండింగ్ ఇంజనీరు ఎన్. టి. జ్ఞానప్రకాశంగారు రిటైరయ్యేముందు జూలై ఆయిదవ తేదీనుంచి రెండు నెలల పదిహేనురోజుల సెలవు మంజూరయింది.

ధవళేశ్వరం సర్కిల్ సెంట్రల్ డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు ఎస్. వి. చలపతిరావ్ గారికి బదులు ఎస్. తనికాచలమదలిగారు ఆ వుద్యోగంలో నియమించబడ్డారు.

ఇప్పటి ఉద్యోగంనుంచి విడుదల అయిన తరువాత ఎస్. వి. చలపతిరావ్ గారు నెల్లూరు డివిజన్ ఎగ్జిక్యూటివ్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేస్తారు.

కర్నూలు డివిజన్ నంద్యాలలో హైవేస్ శాఖ డివిజనల్ ఇంజనీరుగా పనిచేస్తున్న ఎమ్. ఎల్. నారాయణ్ గారికి సెలవు మంజూరయింది. కనుక బాపట్ల డివిజన్ హైవేస్ అసిస్టెంట్ ఇంజనీరు ఎ. నరసింహారెడ్డిగారు ఆ వుద్యోగంలో తాత్కాలికంగా పని చేస్తారు.

చిత్తూరు డివిజన్ హైవేస్ డివిజనల్ ఇంజనీరు ఎస్. రామచంద్రరావ్ గారికి సెలవు మంజూరయింది. కనుక గూడూరు డివిజన్ హైవేస్ అసిస్టెంట్ ఇంజనీరు ఎస్. శర్మారావ్ నాయుడుగారు చిత్తూరు డివిజన్ హైవేస్ డివిజనల్ ఇంజనీరుగా తాత్కాలికంగా పనిచేస్తారు.

విశాఖపట్టణం హైవేస్ డివిజనల్ ఇంజనీరు ఆర్. ప్రభలగారు బదిలీ అయినారు కనుక తిరుపతి హైవేస్ డివిజనల్ అసిస్టెంట్ ఇంజనీరు డి. నారాయణరాజుగారు ఆ వుద్యోగంలో తాత్కాలికంగా పనిచేస్తారు.

ఏలూరు హైవేస్ డివిజనల్ ఇంజనీరు సి. వి. మాధవరావ్ గారికి సెలవు మంజూరయింది. కనుక ఆర్. ప్రభల గారు పశ్చిమగోదావరిజిల్లా హైవేస్ శాఖ డివిజనల్ ఇంజనీరుగా పని చేస్తారు.

కాకినాడ హైవేస్ డివిజనల్ ఇంజనీరు పి. నారాయణగారు బదిలీ అయినారు. కనుక [illegible] డివిజన్ హైవేస్ అసిస్టెంట్ ఇంజనీరు కె. భావనారాయణగారు ఆ వుద్యోగంలో తాత్కాలికంగా పనిచేస్తారు.

ప్రస్తుతం చేస్తున్న ఉద్యోగంనుంచి విడుదలయిన తరువాత పి. నారాయణగారు హైవేస్ శాఖ, ట్రాన్సుపోర్టు-మెషినరీ డివిజనల్ ఇంజనీరుగా పనిచేస్తారు.

గుంటూరు రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరు పి. ఎస్. రాజగోపాలరాజుగారు సెంట్రల్ రోడ్ ట్రాఫిక్ బోర్డు సహాయకార్యదర్శిగా నియమించబడ్డారు. కనుక విజయవాడ రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరు జి. వి. కృష్ణారెడ్డిగారు యిప్పటి ఉద్యోగంతోపాటు గుంటూరు రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరుగా కూడా పనిచేస్తారు.

విశాఖపట్టణం రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరు ఎం. విరాస్వామిగారు గుంటూరు రీజనల్ ట్రాన్సుపోర్టు ఆఫీసరుగా పనిచేస్తున్నారు.

చిత్తూరు అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసరు టి. వేదాంతంగారి బదులు విజయనగరంలో లోగడ అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసరుగా పనిచేసిన ఎం. వెంకటేశ్వరరావుగారు చిత్తూరు అసిస్టెంట్ సెటిల్మెంట్ ఆఫీసరుగా పనిచేస్తారు.

ప్రస్తుత ఉద్యోగంనుంచి విడుదలయిన తరువాత టి. వేదాంతంగారు నెల్లూరు అడిషనల్ సెటిల్మెంట్ ఆఫీసరుగా పనిచేస్తారు.

కాకినాడ డిప్యూటీ ప్రొహిబిషన్ ఆఫీసరు ఆర్. రంగాచారిని ఆ ఉద్యోగం నుంచి వెంటనే విడుదలచేసి ఆయన సర్వీస్ ను మద్రాస్ రాష్ట్ర ప్రభుత్వానికి ఒప్పగించాలని ఆంధ్రప్రభుత్వం ఉత్తరువులిచ్చింది.

సెలవు పూర్తిఅయిన తరువాత కెమిస్ట్రీ లెక్చరర్ పి. సత్యనారాయణగారు జూలై మొదటి తేదీనుంచి ఆంధ్ర వ్యవసాయ కళాశాలలో వ్యవసాయ రసాయన శాస్త్రవేత్తగా పనిచేస్తారు.

ఆంధ్రప్రభుత్వ ఆరోగ్యశాఖ డైరక్టరు కార్యాలయంలో స్టాటిస్ టిషియన్ గా వి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి గారిని ప్రభుత్వం నియమించింది.

ఇన్ కంటాక్సుశాఖ ఇన్ స్పెక్టరు ఎమ్. జంగమయ్యగారిని 1954 జనవరి 27 నుంచి కర్నూలు అడిషనల్ ఇన్ కంటాక్సు ఆఫీసరుగా ప్రభుత్వం నియమించింది.

గోదావరిలోయలో డివిజనల్ జిల్లా ఫారెస్టు ఆఫీసరు ఇ. చిన్నస్వామిగారు ఇప్పటి ఉద్యోగంతోపాటు గోదావరిలోయర్ డివిజన్ వర్కింగ్ ప్లాన్ ఆఫీసరుగాకూడా పనిచేస్తారు.

రేంజరు కె. రాఘవయ్యగారు ఆదోని జిల్లా ఫారెస్టు ఆఫీసరుగా తాత్కాలికంగా నియమించబడ్డారు.

కడప గవర్నమెంటు ఆర్ట్సుకాలేజి ప్రిన్సిపాల్ వి. హబీబుల్లాగారు బదిలీ అయినారు. కనుక రాజమండ్రి ఆర్ట్సు కాలేజి ప్రిన్సిపాల్ టి. వసుంధరగారు కడపకు బదిలీఅయినారు.

వి. హబీబుల్లాగారు రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రిన్సిపాల్ గా బదిలీ అయినారు.

సెలవు పూర్తిఅయిన తరువాత విద్యుచ్ఛక్తిశాఖ అసిస్టెంట్ ఇంజనీరు ఎస్. మార్ సింగ్ గారు కె. గౌరీశంకర్ గారికి బదులు బొమ్మూరు ఆంధ్ర పవర్ సిస్టమ్ అసిస్టెంట్ ఇంజనీరుగా పనిచేస్తారు.

కె. గౌరీశంకరగారు విజయవాడకు బదిలీ అయినారు.

సెలవు పూర్తిఅయిన తరువాత విద్యుచ్ఛక్తిశాఖ ఇంజనీరు ఎమ్. వి. కృష్ణారావ్ గారు రామచంద్రపురం సమాజ వికాస కార్యక్రమాలశాఖ అసిస్టెంట్ ఇంజనీరుగా పనిచేస్తారు. రామచంద్రపురంఆయన ప్రధాన కేంద్రం. తూర్పు గోదావరి జిల్లాలోని జాతీయ వికాస కార్యక్రమాలన్నీ ఆయన పర్యవేక్షణలో ఉంటవి.

విశాఖ పట్టణం ఎలక్ట్రికల్ లైన్స్ అసిస్టెంట్ ఇంజనీర్ శ్రీ పి. జి. వాసుదేవ ముదలియార్ కు సెలవు మంజూరయింది. కనుక హెచ్. రాజగోపాల్ గారు ఆ వుద్యోగంలో నియమించబడ్డారు.

హైవేస్ శాఖ ఛీఫ్ ఇంజనీర్ సాంకేతిక సహాయోద్యోగి ఎ. ఎస్. దామోదరం గారికి రెండు నెలల సెలవు మంజూరయింది.

కడప సూపరింటెండింగ్ ఇంజనీరుకు సహాయోద్యోగిగా పని చేస్తున్న అసిస్టెంట్ ఇంజనీర్ ఎమ్. భైరవమూర్తిగారు హైవేస్ శాఖ ఛీఫ్ ఇంజనీరుకు సాంకేతిక సహాయోద్యోగిగా పని చేస్తారు.

పబ్లిక్ వర్కుస్ శాఖ తాత్కాలిక అసిస్టెంట్ ఇంజనీరు సి. ఇ. గోపాలం గారు. ప్రస్తుతం విద్యుచ్ఛక్తి శాఖలో పని చేస్తున్నారు. ఆయనకు రెండు నెలలు సెలవు మంజూరయింది.

కర్నూలు పబ్లిక్ వర్కుస్ స్పెషల్ డివిజన్ అసిస్టెంట్ ఇంజనీర్ కె. గోపాలకృష్ణయ్య గారికి సగటు వేతనం పద్ధతిలో జూలై మొదటి తేదీ నుంచి నాలుగు నెలల సెలవు మంజూరయింది.

ప్రభుత్వ ఆమోదానికి లోబడి ఈ క్రింద పేర్కొనబడిన జూనియర్ ఇంజనీర్లు, సూపర్ వైజర్లు వారివారి పేర్లకు ఎదురుగా సూచింపబడిన సర్కిల్సులో తాత్కాలికంగా అసిస్టెంట్ ఇంజనీర్లుగా నియమించబడినారు.

విద్యుచ్ఛక్తిశాఖ సూపర్ వైజర్ ఓ. మునగోపాలరావ్ గారు— విద్యుచ్ఛక్తి శాఖ.

జూనియర్ ఏ. రామచంద్రరావ్ గారూ అనంతపురం సర్కిల్ విద్యుచ్ఛక్తి శాఖ.

జూనియర్ ఇంజనీర్ శ్రీ పి. ఎస్. రెమో సెన్— తుంగభద్ర ప్రాజెక్టు హెడ్ వర్క్సు సర్కిల్ సర్కిల్ విద్యుచ్ఛక్తి శాఖ అసిస్టెంట్ ఇంజనీరు.

సూపర్ వైజర్ ఎన్. వెంకటకృష్ణయ్యగారు విజయవాడ సర్కిల్ స్పెషల్ ఛీఫ్ ఇంజనీర్ కార్యాలయానికి నియమించబడ్డారు.

జూనియర్ ఇంజనీర్ శ్రీ ఎస్. విశ్వనాథం - ధవళేశ్వరం సర్కిల్.

విజయవాడ సర్కిల్ జూనియర్ ఇంజనీర్ డి. శ్రీరామమూర్తి-విజయవాడ సర్కిల్ కు.

ధవళేశ్వరం సర్కిల్ సూపర్ వైజర్ శ్రీ ఎమ్. జగన్నాదరావు ధవళేశ్వరం సర్కిల్ కు.

సెలవు పూర్తి అయినతరువాత అసిస్టెంట్ ఇంజనీర్ ఎస్. సూర్యనారాయణగారు ధవళేశ్వరం సర్కిల్ లో పనిచేస్తారు.

శ్రీ ఎమ్. సన్యాసయ్యగారు సెలవు తరువాత విజయవాడ సర్కిల్ కు నియమించబడ్డారు.

ధవళేశ్వరం సర్కిల్ అసిస్టెంట్ ఇంజనీర్ కె. పద్మనాభంగారు ఉద్యోగంనుంచి విరమించుకొంటున్నారు. కనుక ఆ వుద్యోగంలో మహమ్మద్ హుస్సేన్ గారు తాత్కాలికంగా నియమించబడ్డారు.

కడప జిల్లా వ్యవసాయ శాఖాధికారి పర్సనల్ అసిస్టెంట్ ఎస్. కృష్ణమూర్తిగారు కాకినాడ అడిషనల్ జిల్లా వ్యవసాయశాఖాధికారిగా నియమించబడ్డారు.

ప్రస్తుతం సెలవులోవున్న తాత్కాలిక అసిస్టెంట్ సర్జన్ ఎమ్. ఇమ్మద్దీన్ గారు సెలవు తరువాత కాకినాడ హెడ్ క్వార్టర్సు ఆస్పత్రి అసిస్టెంట్ సూపరింటెండెంట్ గానూ, జిల్లా సహాయవైద్య శాఖాధికారిగానూ పని చేస్తారు.

ఇప్పుడు ఆ వుద్యోగంలోవున్న డా॥ వై. నారాయణమూర్తిగారు అదే ఆస్పత్రిలో అసిస్టెంటు సర్జనుగా నియమించబడినారు. ప్రస్తుతం ఆ వుద్యోగంలో వున్న డా॥ బి. శేషగిరిరావ్ గారు విశాఖపట్టణం ఆస్పత్రిలో అవుట్ పేషెంట్సువార్డు మెడికల్ ఆఫీసరుగా నియమించబడ్డారు.

ప్రస్తుతం సెలవులోవున్న డాక్టర్ ఇ. జె. శాస్త్రిగారు డా॥ ఎన్. వి. నారాయణగారికి బదులు విశాఖపట్టణం జిల్లా అనకాపల్లి ప్రభుత్వ ఆస్పత్రి అసిస్టెంట్ సర్జనుగా నియమించబడ్డారు.

విశాఖపట్టణం జిల్లా బొబ్బిలి లోకల్ ఫండ్ ఆస్పత్రిలో తాత్కాలికంగా అసిస్టెంటు సర్జనుగా పనిచేస్తున్న ఎమ్. సీతారామాంజనేయులు గారు రామచంద్రరావుగారికి బదులు నెల్లూరుజిల్లా రాపూరు లోకల్ ఫండు ఆస్పత్రికి నియమించబడ్డారు. రామచంద్రరావుగారు అనంతపురం జిల్లా పేరూరు లోకల్ ఫండు ఆస్పత్రికి నియమించబడ్డారు. పేరూరు లోకల్ ఫండు ఆస్పత్రి డాక్టరు డాక్టరు సి. పట్టాభిరామ్ గారు బొబ్బిలి ఆస్పత్రికి బదిలీ అయినారు.

గుంటూరు హెడ్ క్వార్టర్సు ఆస్పత్రి రిజర్వుడ్యూటీ అసిస్టెంటు సర్జన్ గా పనిచేస్తున్న డా॥ కుమారి ఎమ్. సౌభాగ్యవల్లిగారు తెనాలి ఆస్పత్రికి బదిలీ అయినారు. తెనాలి ఆస్పత్రిలోని డా॥ కుమారి పుష్పావతిగారు అనంతపురం హెడ్ క్వార్టర్సు ఆస్పత్రికి బదిలీ అయినారు. అనంతపురం హెడ్ క్వార్టర్సు ఆస్పత్రిలోని డా॥ కుమారి సాలమన్ గారు అనంతపురంజిల్లా ధర్మవరానికి బదిలీ అయినారు.

## ఫ్యాక్టరీ చట్టంక్రింద జరిమానా

బందరు, జూన్ 29: బందరు ఫ్యాక్టరీల అడిషనల్ ఇన్ స్పెక్టరు శ్రీ బి. కృష్ణమూర్తిగారు దాఖలుచేసిన నేరములను విచారించి, బందరు అడిషనల్ ఫస్టుక్లాసు మేజస్ట్రేటు శ్రీ యస్. వెంకటస్వామి నాయుడుగారు యీ దిగువవిధంగా జరిమానాలు విధించారు.

బందరు జగన్నాధపురములోని శ్రీ సీతారామాంజనేయ రైసుమిల్లు మేనేజరు శ్రీ తమ్మన సీతారామాంజనేయులుగారు రాత్రులందు స్త్రీలచే పని చేయించి, కార్మికులచే నిర్ణీతగంటల సంబంధంలేకుండా పని చేయించిన నేరమునకు రూ. 100/ లు జుల్మానాయున్నూ, బందరు మోడరన్ హోటల్ యజమాని రాత్రులందు 9 గంటల తర్వాత యువకులచే పనిచేయించినందుకు రూ. 10/ లు జుల్మానాయున్నూ విధించారు. (స్వ. వి.)

## దౌర్జన్యంగా కారు స్వాధీనం

### కారైకాల్ ఫ్రెంచి పరిపాలకుని దౌష్ట్యం

పుదుచ్చేరి, జూలై 4: కారైకాల్ జాతీయనాయకుడు రామనాథన్ స్వంత కారును అక్కడి ఫ్రెంచి పరిపాలనాధికారి డూష్నే తన స్వంత వుపయోగం నిమిత్తం దౌర్జన్యంగా స్వాధీనం చేసికొన్నట్లు తెలియవచ్చింది.

డూష్నే ఈ కారువేసుకొని ఇక్కడికివచ్చాడు కూడాను. ఇతడు రామనాథన్ ను తన ఇంటికి పిలిపించి, 'విలీనానుకూల ఉద్యమంలో పాల్గొంటున్నావు జాగ్రత్త, ఏం చేస్తానో' అని బెదిరించి, 'కారు అక్కడ అట్టి పెట్టివెళ్ళు' అని ఆజ్ఞాపించాడట. రామనాథన్ అందుకు నిరాకరించగా ఆయన్ని బయటికి గెంటించివేశాడట. రామనాథన్ ఈ విషయమై ఫ్రెంచి కమీషనరుకు, మద్రాసు కస్టమ్స్ కలెక్టరుకు ఫిర్యాదు చేశారు.

## కారైకాలుకు మందు గుండు రవాణా

6 పెట్టెల మందుగుండు సామానును నిన్న పడవలో ఇక్కడినుంచి కారైకాల్ కు పంపినట్లు తెలిసింది. ఈ ఉదంతం విన్న ఒక జాతీయవాది, ప్రస్తుతం ఫ్రెంచిండియా ప్రభుత్వస్థితి ఎట్లావుందంటే ఏటబడి మునిగిపోతున్న మనిషి గడ్డిపరక కనిపిస్తే దాని పట్టుకొని బయటపడ ప్రయత్నించేటట్లున్నదని వ్యాఖ్యానించారు.

పుదుచ్చేరిలో గతమాసం పత్యాగ్రహోద్యమం నడిపిన విద్యార్థి కాంగ్రెసు నాయకులలో ఒకరైన దామోదరన్ ను ఈ మధ్యాహ్నం రౌడీలు కొట్టారు. విలీనానుకూలురను ఈ విధంగా కొట్టటం ఈ వారంలో ఇది రెండోసారి.



## ప్రకటన

విజయవాడలో వున్న కృష్ణాజిల్లా బోర్డు సెంట్రల్ ఆయుర్వేద ఫార్మసీకి మందులు తయారుచేయు దినుసులు, మూలికలు, వగైరా సప్లయిచేయుటకు సీలుచేయబడిన టెండర్లు, నిర్ణయించబడిన ఫారముల మీద 15-7-54 తేది సాయంత్రం 4 గంటలవరకు చిలకలపూడిలో వున్న కృష్ణా జిల్లా బోర్డు ఆఫీసులో తీసికొనబడును. రు. 8-1-0 ను చెల్లించి జిల్లాబోర్డు ఆఫీసులో టెండరు ఫారము తీసికొనవచ్చును. ధరావతు రు. 500/-లు.

కే. వెంకటరామయ్య,
For స్పెషల్ ఆఫీసరు.
కృష్ణాజిల్లాబోర్డుఆఫీసు, చిలకలపూడి.
డి 2-7-54.

## భారత ప్రభుత్వము

కేంద్ర బ్రాడ్ కాస్టింగ్ & సమాచారశాఖ

## పతకముల నమూనా పోటీ

**(MEDAL DESIGN COMPETITION)**

ఇండియాలోని ఉత్తమ చలనచిత్రములకు స్టేట్ బహుమతులుగా బహూకరించుటకు దిగువ పతకములకు నమూనాలు కోరబడుచున్నవి:

1. ప్రెసిడెంటుగారి బంగారు పతకము - ఇండియాలో తీయబడిన ఉత్తమ చలనచిత్రమునకు. వెండి పతకము - వివిధ ప్రాంతీయభాషలలో తీయబడిన చక్కని చిత్రమునకు.
2. ప్రెసిడెంటుగారి బంగారు పతకము - ఉత్తమమైన డాకుమెంటరీ చిత్రంనకు.
3. ప్రధాని బంగారు పతకము-బిడ్డలకు ఉత్తమమైన చిత్రంనకు.

సంస్థలు లేక వ్యక్తులు నమూనాలు పంపవచ్చును. ఈ డిజైనులు బేస్ రిలీఫ్ మీద తిరుగా ఆకృతి యేర్పరచ వీలగునట్లుగా వుండవలెను. ఈ నమూనాలు నకలు తయారుచేయు వారికి స్పష్టముగునట్లు వర్కింగు డ్రాయింగులుగా వుంటూ ఆయా భాగముల కొలతలు, వాని ప్రాధాన్యత తెలుపుచుండవలెను. పతకము పరిమాణము 2"ల వ్యాసము కలిగియుండును. పతకమునకు యిరుప్రక్కల నమూనాలు 8" × 8" పరిమాణములో పంపవలెను. మూడు వేరువేరు నమూనాలు మూడు పతకములకు అనగా ఒకటి క్రీము మొత్తమమీద ఉత్తమ చిత్రము, రెండవది డాక్యుమెంటరీ చిత్రము మూడవది పిల్లల వినోద చిత్రము. పతకపు ముఖమున ఇతర చిత్రణములతో పాటు ఆ పతకము పేరుకూడా చెక్కించుటకు తగిన వసతి వుండవలెను. వెనుక భాగమున కేంద్ర అధికార చిహ్నము, పతకము బహూకరించు సంవత్సరము, చిత్ర నిర్మాత పేరు, చిత్రము పేరు వుండవలెను.

పై నమూనాలు, "అండర్ సెక్రటరీ (ఫిలిమ్సు) మినిస్ట్రీ ఆఫ్ ఇన్ ఫర్మేషన్ & బ్రాడ్ కాస్టింగ్, ఇండియా గవర్నమెంటు, న్యూ ఢిల్లీ" వారికి, 1954 జూలై 31-వ తేదీ లోగా చేరునట్లు పంపవలెను. ఈ పతకముల నమూనాలు ఇందుకుగాను ప్రత్యేకముగా నియమింపబడు ఒక సెలెక్షన్ కమిటీ వారు పరిశీలించి, వారు ఒక్కొక్క పతకములోను ఎన్నుకొను ఒక్కొక్క ఉత్తమ నమూనాకు రు. 500/- బహూకరింపబడును. పై సెలెక్షన్ కమిటీవారి తీర్మానం అంతిమం. బహుమతులు పొందిన నమూనాలు ప్రభుత్వము సొమ్ము అగును. వీని కాపీరైటు కూడా ప్రభుత్వము వారిదే.

AC. 574

# ఇండోచైనాలో ఫ్రెంచి వీట్మిన్ సైనికాధికారుల చర్చలు ప్రారంభం

## — సహృదయ వాతావరణం

బ్రూంగియా, జూలై 3 హానోయ్‌కి 25 మైళ్ళదూరంలోవున్న ఈ కుగ్రామంలో ఫ్రెంచి యూనియన్, వీట్మిన్ సైనికోద్యోగులు నేడు సమావేశమై యుద్ధవిరమణ ఏర్పాట్లను గురించి సంప్రదింపులు ప్రారంభించారు. ఈ గ్రామానికి చుట్టూరా రెండుమైళ్ళ మేరప్రదేశం తటస్థప్రాంతంగా ప్రకటించబడ్డది. అయిదుగురు ఫ్రెంచిసైనికోద్యోగులూ, ముగ్గురు వీట్నాం సైనికోద్యోగులూ, అయిదుగురు వీట్మిన్ సైనికులు అందులో సంప్రదింపులు ప్రారంభించారు

సమావేశ దృశ్యం అంతా కొరియా సమస్యపై పాన్‌ముంజాన్‌లో జరిగిన సమావేశాన్ని జ్ఞాపకం తెచ్చేట్లుగా ఉన్నది కాని, ఒక్క విషయంలో మాత్రం పూర్తిగా తేడాగా ఉన్నది. కొరియాలో అమెరికన్ ప్రతినిధులు, కమ్యూనిస్టులు శాశ్వతవైరులవలె ముఖాలుముడుచుకుని ముభావంగా ఉంటే, కమ్యూనిస్టు ప్రతినిధులు ఉభయులూ చిరునవ్వులతో సుహృద్వాతావరణంలో సమావేశానికి ఉపక్రమించారు.

ఫ్రెంచి, వీట్నాం ప్రతినిధులందరూ కలిసి ఫ్రెంచి యూనియన్ ప్రతినిధులచే వ్యవహరించ బడుతూ సమావేశాన్ని వీట్మిన్ ప్రతినిధి జనరల్ వాన్‌తియన్‌డూంగ్ ప్రారంభించారు. ఇక్కడ ఈ సంప్రదింపులు ప్రారంభం కావటం పరిష్కారానికి తోడ్పడ గలదన్న ఆశను వెల్లడించారు.

ఫ్రెంచి ప్రతినిధి కర్నల్ లాసెయాబూట్లాడుతూ ఈ సమావేశం శాంతికి దారితీయగలదన్న ఆశ వెల్లడించారు. అయితే సమావేశంలో యుద్ధ విరమణ ఏర్పాట్లకు సంబంధించిన 'నిర్దిష్ట అంశాలను చర్చించ వలసిందే కాని, శాంతి నిర్ణయానికి సంబంధించిన అంశాలను చర్చించకూడదని అన్నారు. ఇక్కడి సంప్రదింపులు జెనీవాలో రాజకీయ సంప్రదింపులకు తోడ్పడేవిగా ఉండాలని అన్నారు. ఈ సమావేశం జెనీవాలో జరిగిన నిర్ణయాలను అమలు జరపటానికి ఏర్పాటయిందని అన్నారు.

జెనీవా నిర్ణయాన్ని అమలుజరపటానికి ఈ సమావేశం ఏర్పాటయిందని కర్నల్ లాసెయా అనటంవల్ల జెనీవాలో సైనిక ప్రతినిధులు జరుపుతున్న సంప్రదింపుల్లో ప్రకటించబడ్డదాని కన్నా ఎక్కువ నిర్ణయాలు జరిగివుండవచ్చునని యిక్కడ భావించబడుతున్నది.

(జెనీవాలో ఉభయ ప్రతినిధులకు యుద్ధవిరమణ ఏర్పాట్లపై దాదాపుగా ఒప్పందం కుదిరిపోయిందని వార్తలు వచ్చివున్నవి.)

అసలీ సంప్రదింపులు కిందటి వారమే ప్రారంభం కావలసివుండి ఇప్పటిదాకా వాయిదాపడినవి.

### కాంబోడియా–వీట్మిన్ సంప్రదింపులు

వీట్మిన్ సైనికాధికారులతో యుద్ధవిరమణ సంప్రదింపులు ప్రారంభించే నిమిత్తం ఆరుగురు కాంబోడియా సైనికోద్యోగులు నేడు జెనీవా వస్తున్నారు. ఈ ఉభయులు రేపు సంప్రదింపులు ప్రారంభిస్తారు. జూన్ 24 వ తేదీన లావోస్, వీట్మిన్ ప్రతినిధుల మధ్య ఇట్లాంటి సంప్రదింపులే జెనీవాలో ప్రారంభ మయినవి.

### హోనాం రాష్ట్రం వీట్మిన్‌లవశం

టోంకింగ్ డెల్టా దక్షిణ ప్రాంతంలో ఉన్న హోనాం రాష్ట్రం యావత్తూ తమ వశమయిందని వీట్మిన్ రేడియో నేడు ప్రకటించింది. అక్కడినుంచి ఉపసంహరించు కుంటున్న ఫ్రెంచి సేనలమీద తమ సేనలు దెబ్బతీసి బాగా నష్టాలు కలిగించినవని ఆ రేడియో వెల్లడించింది.

నిన్న ఫూలీనుంచి ఫ్రెంచి సేనల ఉపసంహరణజరిగిన తరవాతపోరాటం కొంత చప్పబడిందని వార్తలు వచ్చినవి.

### ఫ్రెంచి ప్రధాని ప్రకటన

ఫ్రెంచి ప్రధాని మెండీస్ ఫ్రాన్స్ కతరాత్రి రేడియోలో మాట్లాడుతూ జూలై 20 వ తేదీలోపుగా ఇండోచైనాలో గౌరవ ప్రదమయిన సంధి సదర గలదన్న దృఢనమ్మకాన్ని ప్రకటించారు. తాము నిజంగా శాంతినే కోరుతున్నామనీ, అవసరమయితే గట్టిగా నిలబడి పోరాడేందుకు కూడా సిద్ధమేనని మన ప్రత్యర్థులకు నిరూపించేట్లయితే ఒప్పందం లిప్పసంరా కుదురుతుందని ఆయన అన్నారు.

వీట్నాం ప్రభుత్వంకేంద ఉత్తర వీట్నాం గవర్నరుగా ఉన్న న్గయాక్ సాలోతిపదవికి రాజీనామాయిచ్చారు

Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St, Madras.

## హిందీ టెలిప్రింటరు ప్రారంభోత్సవం

న్యూఢిల్లీ, జూలై 4: హిందీ వార్తా సంస్థ "హిందూస్థాన్ సమాచార్ కార్యాలయం"లో, హిందీవార్తలను ప్రసారంచేసే తొలి టెలిప్రింటరు సర్వీసు ఇవాళ ప్రారంభించబడింది. ప్రస్తుతం ఇది ఢిల్లీ, పాట్నా నగరాల మధ్య వార్తా ప్రసారం సాగిస్తుంది.

ఢిల్లీ కేంద్రంనుంచి వార్తా కార్యాల మంత్రి జగజీవన్‌రాం పాట్నానుంచి పురుషోత్తమదాస్ టాండన్ (పార్లమెంటు సభ్యుడు) గార్ల పరస్పర శుభాకాంక్షలు ప్రసారం చేయబడినవి. జగజీవన్‌రాం అస్వస్థులుగా ఉన్నందువల్ల రాలేదు. ఆయన సందేశాన్ని ఆయన తరఫున కేంద్ర వార్తా ప్రసారశాఖ కార్యదర్శి బి. ఎన్. ఝా చదివారు.

హిందీ టెలిప్రింటరు ప్రారంభించటంపట్ల హర్షం తెలియచేస్తూ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ శుభాకాంక్షలు పంపారు.

ఢిల్లీ రాష్ట్రముఖ్యమంత్రి బ్రహ్మప్రకాశ్ యీ సందర్భంలో జరిగిన సభకి అధ్యక్షత వహించారు.

పాట్నాలో టెలిప్రింటరు ప్రారంభోత్సవానికి బీహారురాష్ట్ర సమాచార్ శాఖ మంత్రి మహేష్ ప్రసాద్ సిన్హా అధ్యక్షత వహించారు.

పురుషోత్తమదాస్ టాండన్ పాట్నానుంచి పంపిన సందేశంలో, ఆంగ్ల వార్తా పత్రికలపైనా, వార్తా సంస్థలపైనా ఆధారపడి, ఆంగ్ల భాషలో వచ్చిన వార్తలను హిందీలోకి అనువదించుకోవలసిన అగత్యం హిందీపత్రికలకు తప్పడం ముదావహమనీ, దీనివల్ల ముమ్ముందు హిందీ భాషా పత్రికలు వర్ధిల్లి హిందీని జాతీయ భాషగా వ్యాపింప చేయడానికి దోహదం చేయడానికి అవకాశం ఏర్పడిందనీ పేర్కొన్నారు.

## తిరువాన్కూరు తమిళ కాంగ్రెస్ పెద్దల అరెస్టు

కొట్టయం, జూలై 4: తిరువాన్కూరు తమిళనాడు కాంగ్రెసు ప్రముఖులు నలుగురను ఇక్కడికి 50 మైళ్లలో గల కవీకులం అనే గ్రామంలో అరెస్టు చేశారు. వీరిలో ఒకాయన పార్లమెంటు సభ్యుడు. జిల్లా మేజిస్ట్రేటు విధించిన 144-వ సెక్షన్ ఉత్తరువును ఉల్లంఘించినట్లు వీరిపై ఆరోపించారు.

తి. త. కాంగ్రెసు అధ్యక్షుడు ఈ చర్య తమిళులకొక సవాలు అనీ, ఇందుకు నిరసనగా తిరుకొచ్చిలోని తమిళులంతా జూలై 6 వ హర్తాల్ జరపాలనీ ఒక ప్రకటన చేశారు.

# భారతదేశంలో మొత్తం 60 వేల కమ్యూనిస్టులు

## —మాస్కో కరపత్రం వివరాలు

లండన్, జూలై 4: ఇండియా కమ్యూనిస్టుల సంఖ్య 60 వేల దాకా వున్నట్లు రష్యన్ కమ్యూనిస్టుపార్టీ వారు తమ ప్రచారకులకోసం తయారు చేయించిన ఒక పుస్తకంలో పేర్కొనబడింది.

ఈ పుస్తకంలో ఇండియాను రష్యా పెట్టుబడిదారీ రాజ్యాలలో చేర్చింది. ఈ పుస్తకంలో ఇండియాతోపాటు బ్రిటన్, బెల్జియం, డెన్మార్క్, స్వీడన్ ఆదిగాగల దేశాలన్నీ పెట్టుబడిదారీ దేశాలుగా పేర్కొనబడినాయి.

ప్రపంచంలో ప్రతి ఒక్క దేశంలోను కమ్యూనిస్టుపార్టీ క్రమంగానో, అక్రమంగానో పనిచేస్తూనే వున్నాయని, అమెరికా, జపాను, పాకిస్తాన్, ఆస్ట్రేలియాలలో కమ్యూనిస్టులను నానా అవస్థలు పెడుతున్నారని ఈ పుస్తకంలో వుంది.

విస్టుపార్టీల బలాబలాలు నిరూపించబడినాయి. అయితే పార్క్, ఐస్‌లాండు, పశ్చిమజర్మనీ, బర్మా, మలయా, పాకిస్తాన్, సయాం, ఇండోనేషియా, ఫిలిప్పైనులు, న్యూజిలాండు, ఆస్ట్రేలియా దేశాలలో ఈ కమ్యూనిస్టుల బలం ఎంతో వివరించి లేదు.

ఈ పుస్తకంలో వున్న ప్రకారం ఆయా దేశాలలో కమ్యూనిస్టుపార్టీ సభ్యుల సంఖ్య సామధ్యాతిపదుల సంఖ్య ఈవిధంగా వుంది. (1) కొరియా-10 లక్షలు, (2) వీట్‌నాం-70 వేలు (3) ఫ్రాన్సు-8 లక్షలు, (4) ఇటలీ-21 లక్షల 20 వేలు, (5) బ్రిటన్-35 వేలు (6) బెల్జియం-1 లక్ష (7) హాలండు-50 వేలు (8) డెన్మార్కు-50 వేలు (9) స్వీడన్-60 వేలు (10) ఫిన్‌లాండు-50 వేలు (11) జపాను 1 లక్ష (12) ఇండియా-60 వేలు ఇండియాలో ఈ లెక్క 1953 లో కట్టించి. తక్కిన సంఖ్య 1949-50

![photo] అంధ్ర విశ్వకళాపరిషత్తు రిజిస్ట్రారు శ్రీ కె. వేణుగోపాలస్వామిగారు అమలాపురం విద్యాశిక్షణ కేంద్రాన్ని సందర్శించినప్పటి ఫోటో.

శ్రీ బాలసరస్వతీ స్త్రీ సమాజం (తెనాలి) 21 వ వార్షికోత్సవం జూన్ 27 వ తేదీన శ్రీమతి కడప రామసుబ్బమ్మగారి అధ్యక్షతన జరిగినప్పటి ఫోటో.

## నల్గొండ సూర్యాపేట బ్యాంకుల విలీనం

### కేంద్రసహకార బ్యాంకుల సభ నిర్ణయం

సూర్యాపేట, జూలై 2: నల్లగొండ కేంద్ర సహకార బ్యాంకు, సూర్యాపేట కేంద్ర సహకార బ్యాంకుల సంయుక్తమహాసభ వై. కొండలరావు గారి అధ్యక్షతన నల్లగొండ కేంద్ర సహకార బ్యాంకు భవనంలో జూన్ 27 తేదీన జరిగింది.

రెండు కేంద్ర సహకార బ్యాంకుల విలీనీకరణకు విడివిడిగా 2 బ్యాంకుల వారు చేసిన తీర్మానాన్ని ఈమహాసభ ఏకగ్రీవంగా ధృవపరిచింది.

సూర్యాపేటలో నల్లగొండ కేంద్ర సహకారబ్యాంకు శాఖ ఒకటి ఉంచుటకు తీర్మానించి, ఈ క్రింది వారిని ఏకగ్రీవంగా కార్యవర్గంగా ఎన్నుకున్నారు: జిల్లా కలెక్టర్ (అధ్యక్షుడు) పుల్లాల రంగారావు (ఉపాధ్యక్షుడు) ఎమ్. నారాయణరెడ్డి (కార్యదర్శి) సహకారశాఖ అసిస్టెంటు రిజిస్ట్రార్, ఉద్యోగుల సహకార సంఘం గారలు

హుజూర్ నగర్, మిరియాలగూడెం నల్లగొండ, సూర్యాపేట తాలూకాల నుండి పరపతి సంఘాలు, సూర్యాపేట నల్లగొండతాలూకా, పట్టణబ్యాంకులు వ్యక్తిగత సభ్యులుగా కోదాటి నారాయణరావు, డాక్టర్ కిర్మ, కట్టారామిరెడ్డి, వై. కొండలరావు, రామిరెడ్డి (వకీలు) గారలుతో మొత్తం 21 మంది కార్యవర్గం ఎన్నుకోబడింది. స్వ. వి.

అనంతపురంలో శారదా మున్సిపల్ మాధ్యమిక పాఠశాల శంకుస్థాపనోత్సవాన్ని 1 వ తేదీన నీలం సంజీవరెడ్డిగారు జరిపినప్పటి ఫోటో. చైర్మన్ మేడా సుబ్బయ్యశెట్టిగారు ఉన్నారు.

# కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణ బాధ్యత

## ప్రభుత్వశాఖలు స్వీకరించాలని ఎస్. కె. డే

న్యూఢిల్లీ, జూలై 3: కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయ విస్తరణ ప్రణాళికలు నిర్వహించడంలో ఇటుపై ప్రభుత్వశాఖలు పూర్తి బాధ్యత వహించాలని కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వాహకుడు ఎస్. కె. డే నేడు ఇక్కడ జరిగిన కేంద్ర ప్రభుత్వ మంత్రిత్వ శాఖల ప్రతినిధుల సమావేశంలో నొక్కి చెప్పారు.

ఈ ప్రణాళికలను అమలు జరపడానికి అనుసరించవలసిన కార్యక్రమాలను గురించి చర్చించే నిమిత్తం ఈ సమావేశం ఏర్పాటు చేయబడింది.

కేంద్రప్రభుత్వానికి చెందిన అన్ని మంత్రిత్వశాఖల ప్రతినిధులూ ఇందులో పాల్గొన్నారు.

18 మాసాలనుంచి మనదేశంలో కమ్యూనిటీ ప్రాజెక్టు కార్యక్రమాలు అమలు జరుగుతున్నాయి.

7 త అక్టోబరులో జాతీయ విస్తరణ ప్రణాళికలు ప్రారంభమైనవి.

నేటి సమావేశంలో ఎస్. కె. డే. ప్రసంగిస్తూ ఇంతటి పెద్ద ప్రణాళి

సమిష్టికృషి అవసరమనీ, ముఖ్యంగా, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రారంభంకాగానే,జాతీయవిస్తరణపథకాలను దేశం అంతటా అమలు జరపడానికి ఇటీవల ఉదకమండలం సమావేశంలో అభివృద్ధి శాఖోద్యోగులు నిర్ణయించినందువల్ల, వీటి ప్రాధాన్యత గురుతరమైనదనీ ఆయన అన్నారు.

కమ్యూనిటీ ప్రాజెక్టులూ, జాతీయ విస్తరణ ప్రణాళికలూ సామర్థ్యవంతంగా అమలు జరపడానికి నేటి ప్రభుత్వ యంత్రాంగమైనా పూర్తి బాధ్యత వహించాలి, లేదా దానితో సరితూగ గలిగే సామర్థ్యంగల సిబ్బంది నయినా నెలకొల్పడం అవసరమనీ, ప్రస్తుత పరిస్థితులలో కొత్త యంత్రాంగం నెలకొల్పడం సాధ్యంకాదు కాబట్టి, ఇప్పుడు పని చేస్తున్న ప్రభుత్వ శాఖలకే ఆ బాధ్యత ఇవ్వడం అవసరమనీ డే వివరించారు.

కమ్యూనిటీ ప్రాజెక్టులకు నాంది జరిగిన నాటనుంచి, నాటిని అమలు జరపడంలో ప్రభుత్వ అభివృద్ధి శాఖలనూ, సేటు శాఖలనూ ఆ కట్టుపని, నాటిని నిర్వహింప చేయడానికి కృషి జరిగించనీ, ఇందులో కొంత వరకు ఫలవంతమైనవనీ, ఇటువైన అయినా ఈ రెండు శాఖలనూ మరింత సన్నిహితపరచి పనులు జరిపించడం

# క్రీడారంగం

## ప్రపంచకప్ ఫుట్‌బాల్‌లో జర్మనీ గెలుపు

### ఒక్క గోలుతేడాతో హంగరి ఓటమి

బెర్న్, జూలై 4: నేడిక్కడ ప్రపంచకప్ ఫుట్‌బాల్ ఫైనల్సులో జర్మనీ ఆశ్చర్యకరంగా హంగరీని ఓడించింది. ఒలింపిక్ విజేతఅయిన హంగరీని జర్మనీ ఒక గోలు తేడాతో ఓడించింది (3-2) ఆట మొదలైన 8 నిమిషాల్లోనే హంగరీ రెండుగోలులు చేయగా, ఆట సగభాగానికి జర్మనీ సమానంగా వచ్చింది. ఆ తరవాత మూడోగోలుతో గెలుపు సాధించింది.

టూర్నమెంటు మొదటినుంచి జర్మనీ ఆశ్చర్యాలమీద ఆశ్చర్యాలను కలిగిస్తూ వచ్చింది. తొలి పోటీలలో హంగరీ చేతిలో 5 గోలుల తేడాలో ఓడిపోయి (8-3) తిరిగి టర్కీని ఓడించిన మీదట క్వార్టరు ఫైనల్సులోకి రాగలిగింది. క్వార్టర్ ఫైనల్సులో యుగోస్లావియానూ (2-0) సెమిఫైనల్సులో ఆస్ట్రియాను ఓడించింది.

హంగరీతరఫున కాప్టెన్ పుస్కాస్ ఒకటీ, రైట్ అవుట్ చిబార్ ఒకటి గోలులు చేశారు. జర్మనీ తరఫున రైట్ అవుట్ మోర్లాక్ ఒకటీ, రాన్ రెండుగోల్సులూ చేశారు.

హంగరీ అంతర్జాతీయ ఫుట్‌బాల్ పోటీలలో ఓడిపోవటమన్నది గత 4 సం||లలోను ఇదే మొదటిసారి.

## నేషనల్ ఫుట్‌బాల్

మద్రాసులో ఈ నెలలో జరగబోయే సంతోష్ ట్రోఫీ నేషనల్ ఫుట్‌బాల్ చాంపియన్‌షిప్ పోటీల కార్యక్రమం జూలై 24-(ఎ) మదరాసు × తిరుకొచ్చి, జూలై 25-(హెచ్) బీహార్ × ఆంధ్ర జూలై 26-(సి)-ఢిల్లీ × 'ఎ' లో గెలిచినవాళ్లు, జూలై 27 - (ఐ) - రాజపుటానా × మైసూరు.

జూలై 28 (జి)—ఉత్తర ప్రదేశ్ × బొంబాయి.

జూలై 29 (జె)—'ఎ' పోటీ విజేత × 'హెచ్' లో విజేత.

జూలై 30 (ఎల్)—(ఎఫ్) విజేత × 'జి' విజేత.

జూలై 31 (ఇ)—మధ్య భారత్ × హైదరాబాదు.

ఆగస్టు2(డి)— అస్సాం × వాయుబలాలు.

ఆగస్టు 3 (సి) పంజాబ్ × ఒరిస్సా

ఆగస్టు (బి)— బెంగాల్ × మధ్యప్రదేశ్.

ఆగస్టు 5 (డి) విజేత × (ఇ) విజేత

ఆగస్టు 6 (జె) 'బి' విజేత × 'సి' విజేత—సెమిఫైనల్సు—

ఆగస్టు 7—'ఎల్' విజేత × 'ఎం' విజేత.

ఆగస్టు 8 'జె' విజేత × 'కె' విజేత.

ఆగస్టు 10—ఫైనల్సు.

## రూసో శిక్షకుడుగా వచ్చే అవకాశం

విజయవాడ, జూలై 3: ఆంధ్ర ఎమెచూర్ ఎథలిటిక్ ఎసోసియేషన్ కార్యదర్శి వి. సూర్యనారాయణగారు ఇట్లు వ్రాస్తున్నారు

ఆంధ్రదేశములో ఎథలిటిక్సును అభివృద్ధిచేయు సుద్దేశ్యములో పై సంఘం యొక్క అధ్వర్యమున విజయవాడలో ఒకశిక్షణా కేంద్రమును షుమారు 3 వారముల పాటు నడుప నుద్దేశించితిమి. నేషనల్ స్పోర్ట్సు క్లబ్ ఆఫ్ ఇండియా కార్యదర్శి ఎ. యస్. డి. మెలో ఈ శిక్షణాశిబిరమునకు సహాయము చేయుటకు వాగ్దానము చేసియున్నారు. వీరి ఆధ్వర్యమున జరుగుచున్న రాజకుమారి అమృత్ కౌర్ కోచింగుస్కీమునకు ఎథిలెటిక్ కోచ్చిగాయున్న శ్రీయుత జె. ఎస్. రూసోను పంపుటకును కొద్ది ఆర్థిక సహాయమును చేయుటకును వాగ్దానము చేసిరి. ఈ శిక్షణా శిబిరము దసరా సెలవులలో నడుపబడును. జె. యస్. రూసో, ఆంధ్రులు, ఈ రంగములో హిందూదేశములో పేరు ప్రతిష్ఠలు గాంచిన వారిలో ప్రథములు. ఆసియా క్రీడాపోటీలకు భారత జట్టునకు శిక్షకుడుగా వెళ్లియున్నారు. 1952 సం|| లో హెల్సింకి వెళ్లిన భారత జట్టునకు శిక్షణ ఇచ్చిరి.

ఇట్టి శిక్షణా శిబిరములు నూతనాంధ్రదేశములో చాల అవసరము. ఇతర రాష్ట్రములలో ప్రతి యేడాది ఇట్టి శిబిరములను పెట్టి యువకుల క్రీడా నైపుణ్యమును అభివృద్ధిపరచుచున్నారు. ఇట్టి శిక్షణా కేంద్రములను మన రాష్ట్రములో ఏర్పాటు చేయుట ఇదే ప్రథమపారి. కావున ప్రజలు, ప్రభుత్వము ఇట్టి శిక్షణా కేంద్రములకు ప్రోత్సాహమును, ఆర్థిక సహాయమును ఇచ్చి ఆంధ్రరాష్ట్రము కూడా క్రీడారంగములో ఎన్నటికి తీసిపోదు, అని ఋజువుచేయవలసి యున్నది. శిక్షణ లేనిదే ఏరంగములోను యువకులు రాణించరు. ముఖ్యముగా పటియాల్ లిప్తించు చూడండి. మన రాష్ట్రములో షుమారు పది 20 సంవత్సరములుగా ఈ క్రీడలో శిక్షణ ఇవ్వబడుచున్నది. అందువల్లనే మన ఆంధ్రులు భారతదేశములో అగ్రస్థానమును వహించిరి. కావున ఇప్పటినుండి ప్రతి క్రీడా శిక్షణా శిబిరములను ఏర్పాటు చేసి, యువకులలో క్రీడా నైపుణ్యమును అభివృద్ధిపరచి ఆంధ్రమాతను ఘనకీర్తిని చేకూర్చగలరని ఆశించుచున్నాను.

పై శిక్షణా శిబిరములో కొంతమంది యువకులకు, (Othleter) అధ్యాపకులకు (teacher) శిక్షణ ఇవ్వబడును. వీరిని రాష్ట్రము మొత్తము మీద ఎన్నుకోబడవలసియున్నది. శిక్షణ పొందిన వారికి సర్టిఫికేట్లు ఇవ్వబడును. శిక్షణా కాలములో కొంత రుసుమును చెల్లించవలసియుండును. భోజనవసతులు కూడ ఏర్పాటు చేయబడును. శిక్షణానంతరము మైసూరు జట్టునకు ఆంధ్రజట్టునకు 'డ్యూయల్ మీట్' ఏర్పాటు చేయబడును.

## నాటింగాంలో పాకిస్తాన్‌కు ఓటమి తప్పనిసరి

నాటింగాం, జూలై 3: నాటింగాం రెండవ టెస్టు మాచిలో పాకిస్తాను చిత్తుగా ఓడిపోయే అవకాశాలు ఎక్కువగా వున్నాయి.

మూడవరోజు సాయంకాలం ఆట ముగిసే సరికి పాకిస్తాన్ రెండవ ఇన్నింగ్సులో 6 వికెట్ల నష్టానికి 189 పరుగులు మాత్రమే చేసింది.

మొదటి ఇన్నింగ్సులో పాకిస్తాన్ 157 పరుగులు చేస్తే ఇంగ్లండు 6 వికెట్ల నష్టానికి 558 పరుగులు చేసి, డిక్లేరు చేసింది.

ఇపుడు రెండో ఇన్నింగ్సులో 189 పరుగులకే 6 వికెట్లు పోగొట్టుకున్న పాకిస్తాన్, ఈ యిన్నింగ్సులో కనీసం ఇంకా 212 పరుగులైనా చేస్తే గాని, ఇంగ్లండు మళ్లీ బ్యాటు చేతిపట్టకుండానే డిక్లేరు చేయగలదు.

నిజానికి ఈ టెస్టులో పాకిస్తాన్ గెలవాలంటే అత్యద్భుతంగా వీళ్లు బ్యాటింగు చేయాలి. మరీ అద్భుతంగా గాలి కలిసిరావాలి. లేకపోతే పాకిస్తాన్ ఓటమి తప్పనిసరే అవుతుంది. రెండవ ఇన్నింగ్సులో పాకిస్తాన్ ఆట వివరాలు ఈ విధంగా వున్నాయి.

హనీఫ్‌మహమద్ 51, పరుగులు. అలిముర్దీన్-18, వకార్ హసన్-7, ఇంతియాజ్ అహమద్-28, కర్దార్-4, ఫజల్ మహమద్ (బ్యాటింగు చేస్తున్నాడు)-5, ఘుజలీ (బ్యాటు చేస్తున్నాడు)-0. ఎక్స్ట్రాలు 2 పరుగులు.

సాయంత్రానికి ఆరు వికెట్ల నష్టానికి పాకిస్థాన్ మొత్తం 189 పరుగులు చేసింది.

బౌలింగు చేసిన ఇంగ్లాండు ఆటగాళ్లలో బెస్సరు 1 వికెట్టూ (11 ఓవర్లకి) స్టాథాం 2 వికెట్లు (14 ఓవర్లకి) ఆపిల్ యార్డు 1 వికెటూ (26 ఓవర్లకి) వార్డిల్ 2 వికెట్లు (21 ఓవర్లకి) తీశాడు.

ఆట తిరిగి సోమవారం కొనసాగించబడుతుంది.

## వింబుల్డన్ టెన్నిస్ జూనియర్ సింగిల్సులో గెలుపు

వింబుల్డన్, జూలై 3: వింబుల్డన్ ఛాంపియన్ షిప్ ఆటలలో, ఆర్. కృష్ణన్ ఇవాళ జూనియర్ సింగిల్సులో ఆస్ట్రేలియన్ ఆటగాడు ఆష్లీ కూపర్‌ని ఓడించాడు.

కిందటేడు ఈ ఛాంపియన్ షిప్‌కే ఆడిన కృష్ణన్ ఓడిపోయాడు.

ఈ సారి 6.2, 7-5, స్కోరుతో కూపర్‌ని ఓడించి ఛాంపియన్ షిప్పు పొందాడు.

వింబుల్డన్ టెన్నిస్ పోటీలు నేటితో ముగిసినవి.

## మార్చినెలలో దేశంలో విద్యుదుత్పత్తి

న్యూఢిల్లీ, జూలై 4: 1954 మార్చి నెలలో మనదేశంలోని 648 సంస్థలు ఉత్పత్తిచేసిన విద్యుచ్ఛక్తి 587,5 మిలియన్ కిలోవాట్ గంటలు ఇందులో 483.5 మిలియన్ యూనిట్లు వాడకందారులకు విక్రయించబడింది. ప్రభుత్వం కొత్తగా నెలకొల్పిన 6 సంస్థలు ఉత్పత్తిచేసిన విద్యుచ్ఛక్తి ఈ మొత్తంలో చేర్చబడింది.

ప్రభుత్వం స్థాపించిన కొత్తసంస్థలలో హైదరాబాదులోని మంచిర్యాల డీసెల్ కేంద్రంఒకటి. మిగతా ఐదింటిలోనూ పశ్చిమబెంగాల్ లో మూడూ, మధ్యప్రదేశ్ లో రెండూ ఉన్నాయి

1954 ఫిబ్రవరి ఉత్పత్తికన్న మార్చి ఉత్పత్తి 43 మిలియన్ కిలోవాట్ గంటలు పెరిగింది.

1953 మార్చిలో ఉత్పత్తి 52.31 మిలియన్ విక్రయం 435.7 మిలియన్ ఉంది. యు. పీ. ఐ.

## బి. ఎస్. సి (ఫైనల్) పరీక్షాఫలితాలు

మదరాసు, జూలై 5: మదరాసు విశ్వవిద్యాలయం 1954 జూన్ లో జరిపిన ఈ క్రింది పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థుల రిజిస్టర్ నెంబర్లు.

### బి. వి. ఎస్. సి. (ఫైనల్)

రెండవతరగతి: 2 టు 4 6 8 9 11 15 టు 18 21 29 30 32 టు 34 36 37 40 టు 44 46 47 49 51 55 టు 57 59 63 64 67 73 టు 76 79 81 83 84 87 89 92 93.

జర్నలిజమ్ డిప్లొమా (సాధుహోందు) లో పోజరైన ఒక విద్యార్థి తప్పిపోయాడు.

## రేడియమ్ ఇన్స్టిట్యూట్

హైదరాబాదు, జూన్ 30: నిజాం ప్రాభవి నా ప్రన్య లు (శ్రీ బాగ్య మహాజన్ రేడియం ఇన్‌స్టిట్యూట్ నిధికి ... ఇచ్చారు. యీ ఇన్‌స్టిట్యూట్ నిర్మాణం భారత సంఘసేవా మహాసభ హైదరాబాదు శాఖ ఆధ్వర్యంలో జరుగుతుంది.

## రేడియో

### బుధవారం, జూలై 7

#### విజయవాడ

ఉ|| 6-55 స్వాగతం 7 తెలుగున వా. 7-15 మద్రాస్ (బి) వలె 7-30 మద్రాస్‌వలె 8 ఆంగ్లమున వా.

మ|| 12-30 మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు 1 (బి) వలె 1-30 (ఎ) వలె 1-40 హిందీలో వా. 1-50 తెలుగున వా 2 (బి) వలె 2-15 ఉన్నత పాఠశాల విద్యార్థులకు.

సా|| 4 ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు 5-30 జొడ్డపాటి సీతామహాలక్ష్మి సంగీతశిక్షణ 6-15 ప్రాంతీయ వా. 6-25 స్థానిక ప్రకటనలు 6-30 గ్రామకార్యక్రమం 7 తెలుగున వా. 7-15 పురాణకాలక్షేపం. 7-30 గానసుధ (రి) 7-45 నీతినియమము: రాముడు (ప్రసంగం) మద్రాస్ 8కి 8 బ్రతుకే చావు నాటిక 8-30 నేషనల్ ప్రోగ్రాం 8 50 గానసుధ 9 ఆంగ్లమున వా. 9-15 ఎస్. సి. వసంతకోకిలం 9-30 జొడ్డపాటి సీతామహాలక్ష్మి (వ) 10 ప్రసార సమాప్తి.

#### మద్రాస్ (ఎ)

ఉ|| 6-55 స్వాగతం 7 వాద్యసమ్మేళనం 7-15 తమిళమున వా. 7-30 వి. ఎస్. కృష్ణమూర్తి వీణ 8 ఆంగ్లమున వా.

మ|| 12-30 మా|| పాఠశాల (రి) 1 మహిళామండలి 1-30 (రి) 1-40 హిందీలో వా. 1-50 గీతమాలిక 2 తమిళమున వా. 2-10 (బి) వలె 2-15 ఉ|| పాఠశాల (రి).

సా|| 4 ప్రా|| పాఠశాల (త) 4-30 పాశ్చాత్య సంగీతం 5-30 ఆర్. సరస 6 ఆంగ్లమున వా|| 6-15 ప్రాంతీయ వా|| (త) 6-25 బి. వి. రామన్ 7 శ్రీవిల్లిపుత్తూరు (తమిళ ప్రసంగం) 7-15 తమిళ వా|| 7-30 జంత్ర సమ్మేళనం 7-45 ప్రసంగం (త) 8 కె. యస్. వెంకట్రామయ్య (వ) 8-30 నేషనల్ ప్రోగ్రాం 8-50 (బి) వలె 9 ఆంగ్లమున వా|| 9-15 ఎం. గోవిందస్వామి నాయుడు వేణువు 9-45 (బి) వలె 10-30 ప్రసారసమాప్తి.

#### మద్రాస్ (బి)

ఉ|| 7 తెలుగున వా|| 7-15 వందే పద్మాకరాం-శ్లోకం జి. ఎస్. బి. 7-30 (ఎ) వలె.

మ|| 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాల విద్యార్థులకు 1 (రి) 1-30 ఆంగ్లమున వా 1-40 (రి) 1-50 తెలుగున వా|| గోటువాద్యం 2-15 ఉన్నత పాఠశాల విద్యార్థులకు జ్ఞానులు లాలబట్ (ప్రసంగం) 4-30 (ఎ) వలె.

సా|| 5.30 (ఎ) వలె 6.15 ప్రాంతీయ వా||6-25 లలితగీతము టి. సూర్యకుమారి.

6-30 గ్రామ|| కార్యక్రమం 7-0 తెలుగు వా|| 7-15 పురాణ కాలక్షేపం 7-30 ఎ వలె 7-45 నీతి నియమము రాముడు (ప్రసంగం) 8-0 బ్రతుకేచావు (నాటిక) 8-30 కె. శంకరఅయ్యర్ 9-0 ఎ వలె 9-45 గానలహరి (రి) 10-30 ప్రసారసమాప్తి.

#### హైదరాబాదు

ఉ|| 6-55 సుప్రభాత్ 7-0 తెలుగు వా|| 7-15 డి. పార్వతి. 7-45 ఘజలే 8-0 ఆంగ్ల వా|| 8-15 హిందీ వా|| 8-30 ఖయాల్. 8-45 ఘజలే.

మ|| 12-30 (రి) 12-50 మరాఠీ వా|| 1-0 సితార్: 1-10 (రి) 1-50 తెలుగు వా|| 2-0 పాఠశాల కార్యక్రమం.

సా|| 5-30 డి. సుశీల - గీతావళి 5-40 సంగీతసాధన 6-0 సాహిత్య హిందీ స్త్రీ జీవితము-రచన: బి. రామదాస్ 6-30 సంధ్యారాగం 6-40 స్థానిక ప్రకటనలు 6-45 గ్రామసీమ త్యాగయ్య-(ప్రసంగం) 7-0 తెలుగు వా|| 7-15 గ్రామసీమ-సాహిత్యదృష్టిలో త్యాగరాజకృతులు (ప్రసంగం) 7-45 కన్నడ వా|| 8-0 ఖయాల్ 8-30 నేషనల్ ప్రోగ్రాం. 8-50 ఘజలే 9-0 ఆంగ్ల వా|| 9-15 ఉర్దూ వా|| 9-30 డి. పార్వతి 10-30 ప్రసారసమాప్తి

## మదరాసు ధరలు

మదరాసు, జూలై 5:

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 57-12-0

| | |
|---|---|
| పెట్టాబంగారం తులం | రు. 85-4-0 |
| మూస బంగారు | రు. 84-2-0 |
| సీమవెండి తులం100కి రెడి | రు. 155-8-0 |
| చిల్లర ధర | రు. 1-10-0 |

### వేరుశనగ

(531 పా|| 1-కి ఎక్సుపోర్టు గిడ్డంగులు మెషిన్-సేల్సుటాక్సుతో సహా) రు. 140-148-0-0

వేరుశెనగనూనె ఎక్సుపెల్లర్ బిలో 8% (500పా.) రెడి చిల్లరధర రు. 270-0-0

టెంకాయనూనె (87½ పౌనులు)

| | |
|---|---|
| అంబుమార్కు | రు. 29-4-9 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | 29-4-9 |
| రాజా బ్రాండ్ | రు. 28-4-9 |

### పంచదార

| | |
|---|---|
| ఫాగోమ్రసా (224 పా) | 85-0-9 |
| పుగుష్యారు (2 అందు) | 88-8-9 |

## బొంబాయిమార్కెట్

బొంబాయి, జూలై 5: ఇవాళ బొంబాయి వెండి బంగారు మార్కెట్

| | |
|---|---|
| వెండి (100 తు.) | 153-12-0 |
| బంగారం (1 తు.) | 84-6-0 |
| సావరిన్ | 57-0-0 |
| కలకత్తా మార్కెట్ ధరలు: | 152-2-0 |
| | 84-6-0; 57-6-0 |